Regd No. N. 45 / M. 3813

వెల ఒక అణా

గోలకొండ డైరీ

అయిపోవచ్చినవి

వెల ౧ రూపాయి

# గోలకొండపత్రిక

ప్రతి సోమ గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

హిందువుల పండుగలు

కర్త సు. ప్రతాపరెడ్డి

౩౦౦ పుటలు వెల ౧ రూ॥ మాత్రమే.

మేనేజరు గోలకొండపత్రిక

సంపుటము ౧౬ హైద్రాబాదు,దక్కన్. శా. శ. ౧౮౬౩ వృషనామ సం॥ర భాద్రపద బ॥ (౧౦-౧౨-౧౩౫౦ ఫ.) సోమవారము. ★ సంచిక ౩౭


# ఇరాను ప్రభుత్వము బ్రిటిషు షరతుల కంగీకరించుట

## ఆర్కిటిక్ ప్రాంతములో బ్రిటిషుసేనలు

### బ్రిటను, రష్యాలషరతులలో అనేకములకు ఇరానుసమ్మతి

**లండనుకు ఆస్ట్రేలియా ప్రతినిధి**

ఆస్ట్రేలియాయొక్క పూర్వప్రధాని అహో డాల్ఫ్‌సే లండనుకుపోవువిషయంలో తేబరుషా ర్టీవారా క్షేపించుటవల్ల రాజీనామానిచ్చి, ఫాడ నుగారి ప్రధానిఅయియుండిరిగదా. ఇపుడు ఫ్రాడ నుగారు వాణిజ్యశాఖామంత్రి లండనుకుపోవునని సెప్టెంబరు ౭ వతేదిన ప్రకటించినారు.అమంత్రిగా రే ఆస్ట్రేలియాప్రభుత్వానికి బ్రిటిషుప్రభుత్వం తో సంబంధమును కలిపియుంచెదరు,

**రూజ్వెల్టు చర్చిలుగారలు చర్చించిన విషయాలు**

రూజ్వెల్టు చర్చిలుగారలు అట్లాంటిక్ సము ద్రముమీద చేరి నాలుగురకముల విషయములను గు రించి చర్చించినట్లు చర్చిల్‌గారు చెప్పిరి. ౧) రాజ్యక్రమల ప్రకటన ఒకటి, (౨) రష్యాకు సహాయపడుట (౩) జపాను క్రొత్తప్రదే శములపైకిపోకుండ చేయుటకు అచరణీయమైన ఉపాయములు (౪) ఉభయ రాజ్యాలు నిబిక, సైనికశాఖలకు సంబంధించిన ప్రత్యేక విషయముల శేకములను గూర్చిన సమాచాంగీకార ము- ఇవి ఇరువురునాయకులుచర్చించిన ముఖ్య విషయములు.

**యుద్ధవిషయములు**

తర్వాత చర్చిలుగారు యుద్ధవిషయములను గు రించి ఉపన్యసించిరి-వాటిలో విముఖ్యమైన అం శములుమాత్రము తెలుపబడుచున్నవి-పోయిన జూ లై, ఆగస్టునెలలలో శత్రువుచే సముద్రములో ముంచబడిన బ్రిటిషు మిత్రమండలినౌకల లెక్క- బ్రిటిషువారును, వారిమిత్రులును విమానాలతోను, జలాంతర్గాములతోను ముంచివేసిన జర్మనీయు, ఇటాలీయనౌకల లెక్కలో మూడవవంతుకంటె అంతఎక్కువకాదు-ప్రతిరాత్రి ౩౦-౪౦ జర్మనువి మానాలు బ్రిటిషువారిసముద్రంలో మందుగనుల నువేయుచుండును-ఇపుడు బ్రిటిషుఓడలు ఒక క్రొత్తసాధనముతో వాటివల్లఉపద్రవమును చాల వరకుతగ్గించినవి-౧౯౪౧లో బ్రిటిషు జలాంతర్గా ములు ఇంతవరకుముంచివేసినట్టియు, చాలఎక్కు వగా పాడుచేసినట్టియు శత్రునౌకలసంఖ్య ౧౭- ౧౦౫౦శత్రుసామగ్రినౌకలపై టార్పిడోలు వేయ బడెను. వాటిలో అనేకములు మధ్యధరాసముద్రము మీదుగా లిబియాలోని శత్రుసేనలకు సామగ్రుల ను, ఆదనపుసేనల సహాయమును గొనిపోవునట్టివి- యుద్ధప్రారంభమునుండి ఇంతవరకు ౧౦లక్షల టన్నులనౌకలు సముద్రంలోనుండి బయటతీయ బడినవి-అయినను ఉపద్రవభయము తొలగినదని ఎంచరాదు. ఏలయనగా, జర్మనులు అంతకంతకు ఎక్కువగా "యూబోటు"లను, పెద్దతుపాకులను ఉపయోగించుచున్నారు.

ఐస్‌లాండులో బ్రిటిషు సేనలును, అమెరికా సేనలును ఉంచబడినవి.

సిరియాప్రజలకు స్వపరిపాలనము ఇచ్చుట బ్రి టిషుప్రభుత్వవిధానము-దీనిసాఫల్యమునకై యు ద్ధముముగియువరకు వేచియుండవలసిన అవసరము లేదు.

ఇరానులో జర్మనులు అక్కడిపెట్రోలుగను లను వశపరచుకొనకుండా చేయుటకును, ఇరాను మీదుగా రష్యాను చేరుట దగ్గరిమార్గముగనుక ఆ మార్గమును పోగొట్టుకొనకుండ నిల్పుకొనుటకును బ్రిటిషువారుఉద్దేశించిరి- అందుకై ఇరానునుండి జర్మనులనందరిని వెళ్ళగొట్టుటకును, బాప్రాసుం డి కాస్పియన్ సముద్రమువరకు రైలుకొటను బ్రిటి షువశములోనుంచుటకును బ్రిటిషువారు ఇరాను ప్రభుత్వమునుకోరిరి-ఇరాను ఆక్రమణవల్ల జర్మను లు తూర్పువైపుగావడచి ఇండియాను ఆక్రమించ కుండచేయుట మరొకలాభము.

**ఆర్కిటిక్ సముద్రమందలి దీవిలో బ్రిటిషు సేనలు చేరుట**

బ్రిటిషుసేనలు కనడావారిసేనలను, నార్వే సేన లను వెంటబెట్టుకొని ఆర్కిటిక్ మహాసముద్రమం దుఉండే స్పిట్జుబెర్గెన్ అనుదీవిలో చేరినట్లు ఈ సెప్టంబరు ౮వతేది రాత్రివేళ బ్రిటిషుప్రభుత్వ యుద్ధశాఖచే బయటపెట్టబడినది-బ్రిటను ఉత్తర ప్రాంతమునుండి ౧౫౦౦మైళ్లదూరములో గ్రీనులాం డుకును ఆర్కిటిక్ సముద్రమునానుకొనియుండు రష్యాభాగమునకును మధ్యన ఈదీవియున్నది-ఈ దీవిలో బొగ్గుగనులున్నవట-వాటిని నార్వే ఉత్తర భాగమందలిప్రజలు ఉపయోగించుకొనుచుండె డివారట- రష్యావారుకూడ "లాంగ్ యియర్ సిటీ" అనుపేరుగలనగరానికి ౫౦మైళ్లలో ఈదీవి లోనుండు బారెంట్సుబర్గుఅను చోటగల బొగ్గు గనులనుండి బొగ్గుతీసికొనుచుండెడివారు-జర్మను లు నార్వేనుఆక్రమించినపుడు మొదట చాలరో జులవరకు ఆబొగ్గుగనులజోలికి పోకుండఉండిరి- కాని రష్యాతో యుద్ధముప్రారంభించినతర్వాత ఆబొగ్గుగనులనుండివచ్చే బొగ్గునంతటిని జర్మనులు తీసికొనుటకు పన్నాగములుపన్నుచున్నారని తెలి సి బ్రిటిషువారు జర్మనులకు ఆగనులుచిక్కకుండ చేయుటకై ఆదీవిలోతమసేనలనుపెట్టిరి- ఈదీవిని తమవశమునసుంచుకొనుటవలన బ్రిటిషువారికి ను రొకసౌకర్యముకలుగునుగా బ్రిటనునుండి ఉత్తరమార్గ మునసముద్రముపై బ్రిటిషు నౌకల నుపయోగించి జర్మనీతో పోరాడుచున్న రష్యాకు యుద్ధసామ గ్ర్యాదిసహాయమును పంపుచుండవచ్చును-దక్షిణ మార్గమున మధ్యధరాసముద్రముమీదుగా ఇరాను కు అట్టిసహాయమును చేర్చి ఇరానునుండి రైలుమా ర్గమున ఉత్తరమున రష్యాకు దానిని పంపుటకు సౌక ర్యము ఇరానుఆక్రమణచే ఏర్పడియున్నదిగదా! అంతేగాక బ్రిటిషువారు స్కాండినేవియాపై సైనికచర్యగైకొనదలచి, అందుకు వాటము గా ను ండునని భావించి స్పిట్జ్‌బెర్గెన్‌కు సేనలనుచేర్చినట్లు స్కాండినేవియాలో సైనికవిషయములను గురిం చి చర్చించగలవారలు అనుకొనుచున్నారు- అది ఎట్లుజరుగునో ముందుగానే తెలియదు-

**బ్రిటను, రష్యాల షరతులకు ఇరాను సమ్మతి**

బ్రిటిషుప్రభుత్వము వారును, రష్యాప్రభుత్వము వారును ఇరానుప్రభుత్వమునకు మరొకలేఖను సె ప్టెంబరు౫వతేదిన అందజేయించిరి- ఇరానులోని జర్మనులను, జర్మనుల పక్షపాతులను ఇరానునుండి వెడలగొట్టవైన వెడలగొట్టవలెను, లే దా బంధములో నైనసుంచవలెను అని బ్రిటను ర ష్యాలు కలిసియు గాకోరినట్లు కనిపించుచున్నది, ఇ రానులో జర్మనీ,ఇటలీ,హాంగరీ, రుమేనియాల రా యబారుల ఆఫీసులనుఎత్తివేయవలెననియు, జర్మ నుప్రజలను బ్రిటిషుసేనలకును రష్యాసేనలకును అ ప్పగించవలెననియు, ఇరానీయసేనలను ఉర్మియా సరస్సుకు దక్షిణమున ఒకచోటినుండి కాజ్వీను, సెమ్నానులగుండా, టెహిరాను, మెహీలకుతూ ర్పుగాను, ఖనాఖిన్, కెర్మాన్షా, ఖొర్రమాబా దు, దిజ్‌ఫుల్, మస్జిదుసులేమాన్ హాఫ్త్‌ఖేల్ బం దర్‌దిలాంలను పట్టణములవరుసకు తూర్పు గాను, ఉత్తరముగాను తొలగించివేయవలెననియుకూడ ఇరానుప్రభుత్వమునకు షరతులు విధించబడినవట ఇందులో ఇరానీయసేనలను తొలగించవలసినప్ర దేశములనుగురించి ఇరానుప్రభుత్వమువారు బ్రిట ను, రష్యాలకు తమఆక్షేపణలను తెలుపుచు,తక్కి నషరతులనన్నిటిని అంగీకరించినట్లు ఇరానుప్రధా ని సెప్టెంబరు ౯వతేదిన ఇరానుపార్లమెంటు ప్రత్యేకసమావేశమందు ప్రకటించినాడు ఇరాను సేన ఆయుధములను తమవద్దనే ఉంచుకొనుటకు బ్రిటిషువారు సమ్మతించినారు. అఆయుధముల తో ఇరానీయులు బ్రిటిషువారిశత్రువులకు సహా యపడకుండ బ్రిటిషువారికే సహాయపడుచుండున ట్లు జాగ్రత్తవహించవలెనని బ్రిటిషుపార్లమెం టులో కెప్టెన్ మార్గెసన్ గారు బ్రిటిషుప్రభుత్వ పక్షమున అభయమొసగిరి- ఇదిఇట్లుండ బ్రిటిషు వారును, రష్యావారును ఇరానుప్రభుత్వమువారికి మరియొక హెచ్చరికను ఈసారి ౪౮ గంటలలో గా సరియైనసమాధానముకోరుచు అంత్యసందేశ మునుపంపించినట్లు ఒకవార్తవచ్చినది- ఆ(దుపు సెప్టెంబరు ౧౧ వతేదిరాత్రి రాత్రివేళనో, అను రునాడో తీరిపోవునట ఆలోగా ఇప్పటికిని ఇ రానులో నిర్బంధితులు గాకుండతిరుగుచున్న జర్మను లను బ్రిటను, రష్యాలసేనలవశము చేయవలెనట.

ఇరానులో ఇటాలీరాయబారి ఆఫీసుఎత్తివే యబడినది అందువల్ల ఇరానులోని ఇటలీయుల క్షేమమును అక్కడిజపానీయరాయబారి ఆఫీసు వారు గమనించుచుందురు.

జర్మనులు ఇరువురుకొండలలోపోయి దాగి యున్నారట. రష్యాలోయుద్ధముముగించి జర్మ ను సేనలు అక్కడినుండి కాకేసస్‌మీదుగా ఇ రానులోదిగువరకు ఆ యిరువురుజర్మనులు అక్క డనే యుండవలెనని ఇరానులోని జర్మనురాయబా రి కార్యాలయమువారు వారికిపురికిని తెలియబ రచినారట.

ఇపుడుఇరానులో రష్యావారిసేనలు ఇరానుఆ ఫ్ఘనిస్థానముల మధ్యసరిహద్దుసమీపములో తు ర్బాత్‌షేక్ జామినుండి తుర్బాత్ హైదరిగుండా మషహాదుకును, అక్కడినుండి కాజ్వీనుకును, అ క్కడినుండి ఉర్మియాకును మొత్తముసుమారు ౧౦౦౦ మైళ్లపొడవున నిలచియున్నవని తెలిసినది- ఒకచిన్నబ్రిటిషు సైనికదళము సెప్టెంబరు౫వతేదిన ఉర్మియాసరస్సుకు పడమటను, ఇరాకుసరిహద్దు సమీపమున ఉష్నేవెద్దను రష్యాసేనలతో కలిసి కొన్నదట.

సెప్టెంబరు౧౧వతేదిన ఇరానులోని రష్యారా యబారిఆఫీసుఅధికారులును బ్రిటిషురాయబారి ఆఫీసుఅధికారులుకలిసి ఆలోచించిరి. ౨౫౦ మందిజర్మనులు ఇరానుప్రధాననగరమునుండి సె ప్టెంబరు ౧౨వతేదిన ఇరానీయపోలీసుకాపలా తో రైలుబండ్లలోపంపివేయబడునట్లును, బ్రిటిషు వారికప్పగించబడిన ౨౦౦జర్మనులు దక్షిణ ఇరా నులో అహ్వాజులో బంధించబడునట్లును తక్కిన ౨౫౦జర్మనులు రష్యావారివశమైనకాజ్వీనులో బంధితులుగనుంచబడునట్లును తీర్మానములుచేయ బడినవి- ౧౨వతేదితర్వాత వరుసగా ప్రతిరోజు కొంతమందినంగున అందరును బయలుదేరువరకు జర్మ నులను అహ్వాజునకుపంపించి తర్వాతఅక్కడినుం డి అందరిని ఇండియాకుపంపివేసెదరట. జర్మనీ, ఇటలీ, హాంగరీ, రుమేనియాల రాయబారుల ఆఫీ సులలోపనిచేయువారలు స్వదేశములకు వెళ్లిపోవ లెనని బ్రిటిషు,రష్యావారలు తీర్మానించుకొన్నారు

**రష్యా, జర్మనులయుద్ధము**

రష్యా, జర్మనులయుద్ధమునుగూర్చి పరస్పరవి రుద్ధవార్తలుకొన్నియు. ఒకపక్షమువారుఒప్పు కొని, మరొకపక్షమువారు ఒప్పుకొనివార్తలు కొన్నియుచ్చియున్నవి.

ఉత్తరరంగమందు జర్మనుసేనలు లెనిన్గ్రాడుకు తూర్పునసేవానుచేరి, అక్కడినుండివడచి లడో గాసరస్సుగట్టునలెనిన్గ్రాడునకుతూర్పున౫౫మైళ్ళ దూరములోనుండు ష్లూసెల్‌బర్గుపట్టణమును పట్టు కొన్నట్లును దీనివల్ల భూమార్గమునఎటునుండిగాని లెనిన్గ్రాడులోకి ఇతరులుప్రవేశించ వీలులేకుండ ముట్టడిపూర్తియైనదనియు జర్మనులు సెప్టెంబరు౮ వతేదినప్రకటించుకొనినారు- కానిఇదిఅందులో నివారణవల్ల రూఢిపడకున్నది- ఈఆట్వేయాగుం డాను ఎస్టోనియాగుండాను పోవు రైలుబాటలు జర్మనులవశములోనుండుటవలన జర్మనుసేనలు ఎ క్కువగా లెనిన్గ్రాడురంగమందు చేర్చబడియున్నవి

లడోగాసరస్సుపై పోరాడుచున్న ఫిన్నిషుసేన లు ఓనెగాసరస్సుయొక్క నైఋతిమూలనుండి లడోగాసరస్సుయొక్క ఆగ్నేయమూలకుపాఱు నట్టి స్విరీఅనునదివద్దకుచేరినట్లు జర్మనులుఆదే తేది న ప్రకటించియున్నారు ఈమాటనిజమైనచో రష్యాలో ఉత్తరపుకొసనును, పడమటిభాగము నకునుమధ్య సామగ్రులనుగొనిపోవు రెండుముఖ్య మార్గములు రష్యావశమునుండి తప్పిపోవునేమో యని భయపడవలసియుండును. తెల్లసముద్రమును పడమటిరష్యానుకలుపు "స్టాలిన్ కాలువ" స్విరీ నదినిసరించిపోవును- మర్మాన్స్కునుండు దక్షి ణమునపోవురైలుబాట స్విర్ నదిపైపోవును. ఈ మార్గములనుబంధించి లెనిన్గ్రాడుకు తూర్పునను, ఆగ్నేయమునను జర్మనులతో కలిసికొనవలెనని ఫి న్నిషుసేనల ఉద్దేశ్యమైయుండవచ్చునేమో! కా ని రష్యావారలు ఈరంగములో తామువిదవరలో పోగొట్టుకొనియుండిన అనేకప్రదేశములను తిరిగి రాబట్టుకొంటిమని చెప్పుచున్నారు గానివాటిపే రులను తెల్పలేదు-

ఇకమధ్యరంగములోకూడ రష్యావారు తాము అనేకప్రదేశములనుతిరిగి వశపరచుకొంటిమని చెప్పు చున్నారుగాని వాటిఅన్నిటిపేరులను తెల్పుటలేదు జర్మనుల రష్యావారు అప్రదేశములనుతిరిగిరాబట్టు కొనుటకై చేసినప్రయత్నములను ఒప్పుకొనుచు న్నారుగాని రష్యాసేనలు జయించలేదనుచున్నా రు- స్మోలెన్స్కుకు ఈశాన్యదిశన ౪౦మైళ్లదూ రమున ఒకచోటినుండి ఆగ్నేయదిశన౧౦౦మైళ్ల దూరమువనున్న ఒకచోటవరకు మొత్తము౨౦౦ మైళ్లపొడవు మూడుచోట్లరష్యాసేనలేముందుగా జర్మనుసేనలమీదికి వచ్చుచున్నవి స్మోలెన్స్కు కు ౫౦మైళ్ళఆగ్నేయదిశలో దెస్నానదియొద్దనున్న ఎల్న్యాను రష్యావారలు పట్టుకొన్నారట. మరి౫౦గ్రామములు వారలకువశమైనవట. స్మోలెన్స్కుకూడ తిరిగిరష్యావారివశమైనదని వదం తులున్నవిగాని రష్యావారుఅదినిజమేనని ఒప్పుకొ నుటలేదు- స్మోలెన్స్కుకుఆగ్నేయదిశలో రష్యా వారుజర్మనులను ఒకనదికావలికి తరిమివేయుట లో ౨౦౦౦జర్మనులుఆనదిలో మునిగిపోయిరని ర ష్యావారనుచున్నారు- గోమెల్ దగ్గరనుండికూడ రష్యావారుపోయినప్రదేశములను రాబట్టుకొనుట కైయత్నించుచున్నారు స్మోలెన్స్కుకు వాయ వ్యదిశలో ౧౫౦మైళ్ళదూరమందు వెలికిలూకి వైపున రష్యావారు సోకుగుండా లెనిన్గ్రాడుకుపో వ్రైలును జర్మనులవశమునుండితొలగించుఉద్దేశ్య ముతో పోరాడుచున్నట్లు కనిపించుచున్నది- కీవ్రం గిరంగములో ఒకముఖ్యపట్టణమును రష్యావారుప ట్టుకొన్నట్లు సెప్టెంబరు౧౧వతేదిన ప్రకటించబడిన ది- మర్మాన్స్కు ప్రాంతములో జర్మనులక్రొత్త పోరాటము మొదలుపెట్టినారని అరోకే జర్మనులు ప్రకటించినారు-

దక్షిణరంగంలో ఒడెస్సానగరసమీపమునకు చేరినరుమేనియాసేనలు ఇంకను అనగరములోకి పోజాలకున్నవి- కీవ్ ప్రాంతమునుండి ఇదివర లో తరిమివేయబడినజర్మనులు ఇప్పుడుతిరిగి దాని నిపట్టుకొనుటకై యత్నించుచున్నారు-

జర్మనులు దినిపరుపడునదిని ఇంకనుదాటగలిగి నట్లుకనిపించదు.

సెప్టెంబరు ౯ వతేదినజర్మనువిమానాలు లెని న్గ్రాడునగరములోనికి పోవుటకు ప్రయత్నించినవి కాని రష్యావారప్రతిఘటనచే కొన్నిమాత్రమే లోపలికిచేరి బాంబులను వేయగలిగినవి.

**బల్గేరియాకు రష్యా హెచ్చరిక**

బల్గేరియాలో జర్మను సేనలు ఇటలీసేనలు నా నాటికి హెచ్చించబడుచున్నవి. బల్గేరియా విమా నాశ్రయాలు జర్మనులఅధికారుల అధీనములోను న్నవి. అక్కడజర్మనువిమానములున్నవి. బల్గేరి యావారివార్నా,బర్గాస్ రేవులలో జర్మనుఇటా లీయుల యుద్ధనౌకలున్నవి. గొప్పజర్మనునౌకా ధికారులు బల్గేరియాలో చేరి జర్మనుల యుద్ధనౌక లను నల్లసముద్రములో రష్యాపైపోరాడుటకు తయారుచేయుచున్నారు. బల్గేరియారాళ్లమీదుగాజ ర్మనుల,ఇటాలీయుల సామగ్రి రవాణాయగుచున్న ది. ఇదంతయు రష్యాకువిరుద్ధముగు జర్మనులకను కూలముగాజరుగుచున్నను బల్గేరియా ప్రభుత్వము వారు ఆక్షేపించకుండ ఉరకుండుటచూడగా బల్గే రియావారు జర్మనులు బల్గేరియా ఆధారంగాచేసి కొని రష్యాలోనిఒడెస్సా,క్రిమియా, కాకేసస్‌ల ను ప్రదేశము పైకిదాడుటకు తోడ్పడుటగాను న్నది. రష్యాతో మైత్రిగానున్నామని చెప్పుకొనవ గియుండుటకు బల్గేరియా ఇట్లుచేయరాదుఅని ర ష్యాప్రభుత్వమువారు ఒక హెచ్చరికనో సెప్టెంబ రు ౧౦ వతేదినఅందజేసినారు. ఆహెచ్చరికలో నే రష్యావారు ఇదివరలో జర్మనీరష్యాపై యుద్ధ ముప్రారంభించుటకుపూర్వము ఇట్టిమిత్రవిరుద్ధ మైన విషయమై బల్గేరియాను ఆక్షేపించియుంటిమని తెలిపినారు.

**నాజీలకు రూజ్వెల్టు కఠిన హెచ్చరిక**

రూజ్వెల్టుగారు సెప్టెంబరు ౧౨వతేది ఉదయ ము బ్రాడ్‌కాస్టుఉపన్యాసములో ఇకమీదట జ ర్మనీఇటలీలయుద్ధనౌకలు అమెరికా వారిరక్షణలో సముద్రప్రాంతములోనికి వచ్చి చో వాటిపై దెబ్బలువేయబడునని తీవ్రముగా హె చ్చరించిరి. అమెరికాజాంగనౌకలు, విమా ములు తమరక్షకనౌకలనేగాక తమసముద్రములో తిరుగుచున్నవచ్చు మరేదేశపునౌకలనుగాని రక్షించగలవని స్పష్టముగాచెప్పిరి న్యాయముగా ౯వ పేజీ చూడుడు

## మిత్రసందేశము

సత్యప్రసాద్!

నీ ఉత్తరాలు దుఃఖాన్ని, ఆశను కలుగజేశాయి. అలస్యంచేయక, ఏ దేలాఉన్న ఒక "శాతీలు" రోజు చూచి, వెంటనే, మనమిద్దరము కలు సుకునే ఏర్పాటు తప్పక చెయ్యాలి. జరూరు. లేకపోతే, "నేను కూడా నీ........."

ఇట్లు
"కృష్ణ"

# క్షామబాధానివారణము

ఈదేశములో ఎచ్చటను వర్షములు కురిసినట్లు చెరువులు నిండినట్లు కాలము సుభిక్షముగానుండి నట్లు జాడలు లేవు ఏమి కర్తవ్యము?

తనదరిద్రమైతే తట్టుకోవచ్చును దేశదారిద్ర్యమునకు తెరువులేదు ఇక రాగా పోగా ప్రజలకు తోంచినమార్గ ప్రభుత్వముమీద నున్నది. కాని ప్రభుత్వము ఎంతభాగ్యవంతమైనదైనను యీ ప్రజలందరికి యీ పశువులన్నిటికి ఆహారపానీయములు సప్లయిచేసి పోషింపగలదా?

మునుపు గోల్కొండ ప్రాంతమునకు ఒక జిల్లాకు ఒక కాలాకు కరువు తటస్థించినప్పుడు అప్పటి ప్రజలచేత గొల్లుమనుకొనకరకొట్టింపి నూలి వారి జనము లాగాంత భాగమును పోషించుచున్నట్లుగా ఎరుగుదుము. అట్టికంకరరోడ్లవలన భాగ్యవంతులకారు లును ప్రభుత్వము వారి ఒస్సులును పోహుంకార్ల లారీలును, సుఖముగా నడచుటకు వీలేర్పడినది. యిది కొంతవరకు మంచికార్యమై తేకావచ్చును. దీనివలన క్షామము చేరత అరికట్టబడజాలదు.

క్షామము ఎన్నిటికి నిరువులేని నీటివసతులను కలిగించుటవలన నిరోధించబడును. ౧౬ జిల్లాల యందు ప్రజలు మలమలమాడిపోవుచుండగా కృష్ణాగోదావరి నదులు పొంగిపారలి ప్రవహించుచునే యున్నవి. యీ రెండునదుల క్రింద ౧౨ లక్షల యకరములు కరిపొలములు శోభాయమానముగా నున్నవి. మననైజాములో అసంఖ్యాకములైన చెరువులున్నవి— ఏచెరువులోను మారెడు నీరులేదు, యీ చెరువులకొరకు ప్రతిసంవత్సరము లక్షల కొలది ఖర్చు పెట్టబడుచున్నవి. వానలు సమృద్ధిగా కురిసినప్పుడు యీచెరువులన్ని నిండి ప్రభుత్వము తక్కిలా ధనాయమముగానుండును. ఏమ్రైతులకు మాకమూ లాభకారిగాదా అందురేమో, వానకురిసిన ప్పుడు చెరువులు లేకున్నను ఏమెట్టపంటలనో పండించుకొని ప్రజలు సుఖముగా జీవింతురు. ప్రజలు మెట్టపంటలకంటె మాగాణిపంటలవలన ఎక్కువ లాభమనుభవించుచున్న దేమియులేదు, పైగా, యీఆధికమైనపన్నులు యివ్వలేక మాకు ఇబ్బందులు కలుగుచున్నారు. కాబట్టి యీచెరువుల మాగాణీలు కరువుబాధనివారణకుపయోగపడుట లేదు. ప్రజలను సంతుష్టిపరచుటయులేదు. పీటిని మరమ్మతులకు ప్రభుత్వధనము విస్తారముగా ఖర్చు అగుచున్నది. కావున ప్రభుత్వమునకుకూడ ఎక్కువ ఉపయోగకారిగాదు.

ప్రభుత్వమువారు దృష్టిని మరలించుకోవలయును. మననైజాం రాష్ట్రమునుండియే కృష్ణాగోదావరి నదులు ప్రవహించుచు ఇచ్చటిజలమును, ఇచ్చటి సారమును; కూడా లాగుకొనిపోవుచున్నవి. చెరువులకు బెట్టెవ్యయమంతయు కృష్ణా గోదావరినదులకు అనకట్టలుగట్టించుటకు కాలువలు త్రవ్వించుటకుపయోగించినయెడల యెప్పటికిని రోకరువును లేక జనమంతయు సుఖముగా జీవించుచుండగలరు.

ప్రభుత్వమువారు మొన్న మొన్నటివరకు నైజాం ప్రాజెక్టు పాలేటిప్రాజెక్టు నిజాంసాగరు, హిమాయతుసాగరు, మొదలైన పెద్దపెద్దచెరువులను నిర్మించియున్నారు. మంచికార్యమే! కాని యీసంవత్సరమున వాటిలోకూడ నీరులేదు,

ఏమనగా? యీచెరువులలోనికి పెద్దపెద్దవాగులువచ్చుచుండును కాని ఆవాగులు ఆయాప్రాంతములవర్షముకురిస్తేనేగాని ప్రవహించవు, ఆ చెరువులలో నీరు ఏమీమిగులకుండ ఏరేటికారేమొను ఖర్చుపెట్టబడుచున్నది. చిన్న చెరువులక్రింద ప్రజలువర్షమునకెదురుచూచుచున్నట్లుగానె యీ ప్రాజెక్టులక్రింద ప్రజలుకూడ యెదురుచూడ వలసివచ్చినది— వీటిని సార్థకపర్చవలెనంటే పెద్దపెద్దనదులనుండియో? నమ్మకమయిన యేటినుండియో? వీటికి జలమువచ్చే కాలువలు కావలయును, నైజాం ప్రాజెక్టులోనికి మాన్నేటినుండి కాలువలు తేవచ్చును— పాలేటిప్రాజెక్టులోనికి అకురేటినుండి కాలువ తేవచ్చును, యిట్లే పెద్దపెద్దచెరువులలోనికి ఆయాప్రాంతమందలి యేరులనుండి కాలువలు త్రవ్వించవలయును— అయితే ఇట్టి అనావృష్టి కాలములందు అట్టియేరులుకూడా ప్రవహించవుగదా? వాటిలోనికినీరు ఎట్లురాగలదను ప్రశ్న రావచ్చును— దీనికి సమాధానము గతసంవత్సరమున ఆఖరిపంటపెరుగుచున్న కాలమున పంటబండే కాలమునయేరులు ప్రవహించుచునేయుండును. గనుక పంట ఆఖరయ్యేవరకు ప్రాజెక్టులు పూర్తిగా నింపియుండవచ్చును—

అట్టినీటిని తాబీకియుపయోగింపక మరుసంవత్సరపు అభీష్టమునకై పంటించుటకుగాను నిల్వయుంచబడవలయును, యిట్టిపనివలన ప్రస్తుతము క్షామబాధచే పీడింపబడుచున్న ప్రజలను పోషించి నదీ వల ముందెన్నటికిని ఆయాప్రాంతములయందు కరువురాకుండ నిరోధింపబడగలదు—

ఇట్లు
జంగాహనుమయ్య చౌదరి,
వట్టికొండ నాగేశ్వరరావు, వాసిరెడ్డి వెంకటపతిరావు, (ఆంధ్రజనసంఘ ప్రచారకులు)





## కర్ణాటకాంధ్రులు

మైసూరుసంస్థానంలో ఆంధ్రనిలయ స్థాపనావసరము
మైసూరు ఆంధ్రమహాసభాధ్యక్షుని ఉద్బోధ

మైసూరు, సెప్టెంబరు ౫

మైసూరుసంస్థాన ఆంధ్రసభఅధ్యక్షులు లాయరు నూరప్పగారిట్లు వ్రాయుచున్నారు:—

మైసూరుసంస్థానంలో సుమారు పంద్రెండు లక్షలకుమించి ఆంధ్రులున్నప్పటికిని ఆంధ్రులకొక సంస్థకాని సంఘముకాని లేదు— ఈయాంధ్రులందరు ఇండ్లలో మాతృభాషగా తెలుగే మాట్లాడువారైనను సంస్థానరాజకీయభాష కన్నడమగుటవలనను ఆంధ్రపాఠశాలలు లేనందునను వీరికి కన్నడభాషయే ప్రాంతికమై తెలుగు చదువను వ్రాయను అలవాటుతప్పినది—

### ఉభయభ్రష్టత్వము

కర్ణాటకాంధ్రులలో చాలమందికి తను తెలుగుజిల్లాలలో సంబంధబాంధవ్యములు జరుపుచు నేయున్నారు— కాని, కర్ణాటకులకును ఆంధ్రులకును భాషావ్యత్యాసమేకాక ఆచారసంప్రదాయములందును, లాంఛనమర్యాదలందును, ఇంక నుమతాళయములందును తుదకు వేదపాఠములందును బహుళవ్యత్యాసములున్నవి— కర్ణాటకులదిచాలవరకు ద్రవిడసంప్రదాయము— వేదపాఠములందు ద్రవిడపాఠమే వీరికవలంబనకనుక కర్నాటకాంధ్రులకు క్రమక్రమముగ ఆంధ్రసంప్రదాయము ఆంధ్రసంబంధముకూడ లుప్తమగుచున్నది— ఇట్టితరి, తెలుగుదేశపుఆంధ్రులతో తిరుగాకలియుటకవకాశము తగ్గించుచున్నది— మరియు ఇటీవల కర్నాటకసామ్రాజ్యము కర్నాటకులకేయన్న కర్నాటకోద్యమము ప్రారంభమైనదాదిగా ఈ కర్నాటకాంధ్రులు ఒకవైపున ఆంధ్రమునకును రెండవవైపున కర్నాటకమునకునుకూడ చెడి ఉభయభ్రష్టత పొందెడితరుణమేర్పడుచున్నది— అందుకొరకుముందుగా ఆంధ్రసంబంధము స్థిరపరచుటకును, కర్నాటకస్థానము బలపరచుటకును, మైసూరుసంస్థానములో ఆంధ్రనిలయమేర్పరచుట అత్యవసరము—

మరియు, కర్నాటకదేశములో బెంగుళూరు నందికొండ మొదలగుస్థలములు శీతలప్రాంతములును, ఆరోగ్యవర్ధకములునగుటవలన, ఆంధ్రదేశమందుండి శ్రీమంతులనేకులు వేసవిలో ఈప్రాంతములకువత్తురు— ఇంకను మైసూరులో దసరా ఉత్సవము, కృష్ణరాజసాగరు, కావేరిఅనకట్టు మొదలగుఆనేకవినోదములు దర్శించుటకాంధ్రులుపచ్చుటతరచైనది— ఇటీవల ఆంధ్రశ్రీమంతులు బెంగుళూరులో నివాసము లేర్పరచుకొనిరి— కాని ఒకరినొకరు పరామర్శముచేసికొనక "ఎవ్వరికివారే యమునాతీరే" అన్నట్లు వ్యవహరింతురు— కర్నాటకాంధ్రులకు తెలుగుచదువుటకభ్యాసము లేనందున ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, కృష్ణాపత్రికలకిక్కడ ప్రచారములేదు— కనుక ఆంధ్రదేశము యొక్క విశేషములు కాని వార్తలుకాని తెలియుటకైనను అవకాశములేకున్నది— తాయినాడు మొదలగు కర్నాటకపత్రికలు ఆంధ్రులవిషయములు ప్రస్తావించుటకాని ప్రచురించుటకాని చేయవు.

### ఆంధ్రనిలయము

అందువలన కర్నాటకదేశములో నొకప్రత్యేక ఆంధ్రనిలయము "Andhra Home" ఒకటి ఏర్పరచుటయు, కర్నాటకాంధ్రపురోభివృద్ధికిని, అసలు తెలుగుజిల్లాల ఆంధ్రులతోనేకాక ఇంకను, నైజాంలోను తిరువాన్కూరులోను, పుదుక్కోట, కొచ్చి, తంజావూరుప్రాంతములందు కలమిగిలినఆంధ్రులతోను అత్యంతసంబంధ బాంధవ్యములు పెంపొందించుటకును వలసినప్రయత్నములన్నిటిని సాగించవలెను—

### ఆంధ్రగురుకులము

ఇంకను ఆంధ్రులఆంధ్రత్వమును స్థిరపరచుటకును, వృద్ధిచేయుటకును కర్నాటకాంధనిలయములో బీదలగుఆంధ్రపిల్లలకు విద్యాబుద్ధులు నేర్చుటకును వారి సంస్కారమభ్యాసములు పెంపొందుటకును, ఒక ఆంధ్రబాలగురుకులము Andhra Gurukula స్థాపించుట అవసరము.

మైసూరుసంస్థాన ఆంధ్రనిలయము యొక్కయు, శ్రీచాముండీశంకరపీఠము యొక్కయు ప్రణాళికలు మైసూరులో శరన్నవరాత్రులందు చాముండీపీఠపుకొండమీద పీఠమఠములో జరుగు ఆంధ్రమహాసభలలో ప్రచురింపబడును— కనుక కర్నాటకాంధ్రులందరు విజయదశమిదినమున ఆంధ్రమహాసభకు మైసూరిచాముండికొండకు హాజరగుట కాహ్వానించుచున్నాము.

(ఆంధ్రపత్రిక)

# గోలకొండపత్రిక

వృషనామ సం౹౹ర భాద్రపద బ౹౹ ౯

సోమవారము


## చర్చిల్ ప్రసంగము

ఇదివరలో మేము అష్టదిగ్బంధనము అను పేరుతో రూజువెల్టు, చర్చిల్‌గారలు అట్లాంటికు సముద్రముపై ప్రపంచోద్ధరణకై అష్టసూత్రాలను అంగీకరించి ప్రకటించిన విషయమును గురించి పాఠకులకు విశదముగా నిరూపించియున్నాము. ఇతరుల సంగతియేమోకాని బ్రిటిషు సామ్రాజ్యములో ఉండిన దాస్యదేశాలకు ఈ అష్టధర్మసూత్రాల ఫలితంగా ఏమైన విముక్తి దొరుకుతుందా అంటే అది ప్రమేయములేనిమాట అని చెప్పినాము. మదభిప్రాయాన్నే ఇప్పుడు చర్చిల్ మహామాత్యశేఖరులు సందేహానికి తావులేకుండా స్పష్టము చేసివేసినారు.

మొన్నటి పార్లమెంటుసభలో చర్చిలుగారు మాట్లాడుచు పైధర్మాష్టకమును గురించి మరికొంత స్పష్టపరిచిరు. ఈధర్మసూత్రాలను సూత్రించిన కారణము కేవలం హిట్లరుచేత పరాజితులై బలవంతముగా స్వాతంత్ర్యము కోల్పోయిన యూరోపుజాతుల స్వాతంత్ర్యమును ప్రసాదించుటకే అనిముక్తకంఠముతో చెప్పినారు.

అయితే ఇండియాగతి యేమవుతుందో అని పలువురు ఆందోళనపడుచుండినది వారికి తెలిసినదేమో! లేక కారణముచేతనో యేమోకాని వారు ప్రధానమంత్రిపదవిని స్వీకరించిన నాటినుండి నేటివరకు ఇండియా రాజ్యాంగవిషయము ఏమిన్ని చెప్పకుండా మౌనముద్ర వేసుకొన్నట్టివారు ఇప్పుడు తటాలున ఇండియాను గురించి నాలుగేమాటలు చెప్పినారు. ఆమాటలలో ఏమైనా నూతనత్వముందా అంటే ఏమిన్ని లేదు.

"హిందూస్థానానికి మేము ఆగస్టు ౧౯౪౦ నాడే మాట యిచ్చినాము. మీరున్నూ మాతోపాటుగా స్వేచ్ఛగా ఉండేదానికి అవకాశం కలిగేఅట్లు సహాయపడుతాము, కాని ఇదిబహుకాలమునుండి హిందూస్థానమందలి నానామతాలతో, జాతులతో, వర్గాలతో మాకు ఏర్పడిన బాధ్యతలకులోబడి యుండును" అని యన్నారు.

> " We have pledged by the Declaration of August 1940, to help India to obtain free & equal partnership in the British Commonwealth with ourselves, subject, of course, to the fulfilment of the obligations arising from our long connection with India, and our responsiblities to its many creeds, races and interests."

హిందూస్థానానికి ఏదో ఒకవిధమైన స్వాతంత్ర్యరూపముగల రాజ్యాంగవిధానాన్ని ప్రసాదిస్తాము. కాని అదెన్నడు ఎప్పుడయ్యా అని యడుగగా యుద్ధానంతరము తప్పకుండా ఇస్తామన్నారు' పాపము బ్రిటిషు ప్రభుత్వమువారు. యుద్ధంతర్వాత అంటే ౧౦౦ ఏండ్లుకావచ్చును. అనంతకాలం కావచ్చును. దానికొక కాలపరిమితి చెప్పండి అని మరల అడిగితే "కాలపరిమితి ఏర్పాటుచేయుటకు వీలులేదు" అని గట్టిగా జవాబిచ్చినారు. ఇచ్చటనే కాంగ్రెసువారికి బ్రిటిషు ప్రభుత్వానికిని సంఘర్షణ ఏర్పడింది.

అయినా వారిబుద్ధిపుట్టినప్పుడే స్వాతంత్ర్యము దానముచేయనీకాక! ఆస్వాతంత్ర్యమైనా ఎట్టిదండీఅంటేదానికిమూడేమూడు చిన్నసందర్భాలు అడ్డువచ్చుచున్నవి. అదేమంటే హిందూస్థానంలో ఉండేనానామతాలు, నానాజాతులు, నానావర్ణాలు, హిందూముసల్మానులు సమాధానపడవలెను. వారుసమాధానపడితేచాలదు. ఒకదిక్కు సిక్కులు, క్రైస్తవులున్నారు. ఒకదిక్కు హిందువులపై మాకు విశ్వాసంలేదనిబెదరించే నిమ్నజాతులవారున్నారు. అంతేకాదు నానాజాతులుకూడా ఉన్నారు. వారందరుకూడా సమాధానపడవలెను. ఇదంతా సంభవమైతే ఇకమిగిలినవారు వర్గాలవారు (Interests.)ఇందు పూంజీదారులు, పరిశ్రమలయజమానులు, వ్యాపారులు, ధనికులు మున్నగువారుచేరుదురు. మరి యు ౫౬౨ దేశీసంస్థానాలవారున్నూ ఈ వర్గములోనేచేరుతారు. వీరంతాచర్చిల్ దేశమువారును, పార్లమెంటు వారును "సహాయపడి" స్వాతంత్ర్యమార్గము నిలబెట్టిన భారతదేశప్రభుత్వము సంగీకరింతురా? వివిధదేశీసంస్థానాలలో ఈరాను న్ప్రజాపరిపాలనము ప్రవాహాన్ని అరికట్టేదానికి పెద్దపెద్దరాజకీయపు ఆనకట్టలు నిర్మించుకుంటూఉన్నారు. బాధ్యతాయుత ప్రభుత్వముమాటయెత్తకూడదని యెన్నియో దేశీసంస్థానాలు శాసించినవి. ఇట్టియాటంకాలతో భారతదేశానికి స్వాతంత్ర్యము ఇంగ్లీషు సామ్రాజ్యములో లభించునా?

రూజ్వెల్టుగారు స్వతంత్ర అమెరికా రాష్ట్రాలకు అధ్యక్షులు. వారుధర్మసూత్రాష్టకముపై సంతకముపెట్టి "నేనున్నూ చర్చిలుగారున్నూ ప్రపంచములోని ఏ భాగాన్నికూడా విడువకుండా చర్చించినాము" అనిచెప్పగా ఏమోమనభారతదేశాన్నిగూర్చి కూడా ఏదోయొక్క మంచినిర్ణయమే చేసినారని అనుకొనుటకుఅవకాశంకలిగింది. కానియిప్పటిచర్చిలుగారి వివరణనుబట్టిచూడగా బ్రిటిషు సామ్రాజ్యానికి ఈసూత్రాష్టకంవర్తించదనిన్ని కేవలంయూరోపులోహిట్లరుచే పరాజితమైన దేశాలకే వర్తించుననియు ఇప్పుడు తెలిసిపోయినది. పూర్వము ౧౯౧౮లో అమెరికాఅధ్యక్షులైన విల్సన్ గారు ౧౪సూత్రాలు అంతరార్థము తెలుసుకొనక సంతకముపెట్టియుండిరి. ఇప్పుడు రూజ్వెల్టుగారు యీనూతన యూరోపుస్వాతంత్ర్య సూత్రాష్టకములోని సాధకబాధకాలను బాగా తెలుసుకొని సంతకముపెట్టినారు. రూజ్వెల్టుగారు, చర్చిలుగారును యూరోపుహద్దువరకేయీకార్యముచేయక ప్రపంచాని కంతకునుస్వాతంత్ర్యము స్వేచ్ఛలభించునట్లు పాటుపడియుండిన, బాగుండెడిది- అట్టికాలమెన్నడువచ్చునోయేమో?

## ఖాయదెమిల్లత్ చేసిననింద

శుభంపలుకురా పెండ్లికొడుకా అంటే "ఇరేణికుండపగిలి"అన్నాడట-అదేవిధంగా సరోజినీనాయుడమ్మయ్యగారు "కొడుకా, బహద్దురుయారుజంగూ, నీవు చాలామంచివాడవునాయనా, నీవు హిందువులమతసభలో మాట్లాడుటకురావడంలో ఎంత మంచిపనిచేసినావు"అని అత్యంతముతో అభిమానంతో పలికిరి. ఆయారుజంగుగారు అట్లేఅనుకుంటూనె యేదోవకటి అనేసినాడు. అయ్యవారినిచేయబోయి కోతిపిల్లనుచేసినట్లుగా చేసివేసినాడు.

౨౦ సెప్టెంబరు తారీకునాడు హైద్రాబాదు మార్వాడీమండలివారు గణేశోత్సవానికిగాను నవాబుబహద్దరుయారుజంగు బహద్దరుగారిని ఉపన్యాసం ఇప్పించేదానికిపిలిచినారు-సరేఅని నవాబుగారు ఒప్పుకున్నారు-వారురంగంపైకెక్కి ఎత్తుకుంటూనె యిట్లుమాట్లాడినారు. "హిందూ ముసల్మానులలో ఏవివాదాలున్నూ లేకుండెను- వివాదమంతా ౨౦౨౫ఏండ్లనుండి ఏర్పడింది-ఈవిచారకరమగు పరిస్థితి ఒకవర్గమువారిమూలానజరిగింది-ఈవర్గంవారికి కేవలం కలహాలుకలిగించడమేపని-కాంగ్రెస్ను మిస్టర్ గాంధీకూడా తిట్టినాడు.

నన్ను రక్తంపీల్చేవానినిగా జనులనుకొంటారు హిందూ ముసల్మానులలో వివాదము లేదనీ అది ఒక మతవర్గంవారివల్లనే కలిగిందని అంటున్నాను"అని నవాబుగారొక ఉపన్యాసం ఇచ్చినారు.

ఈనవర్గం ఏదుండవచ్చునోకద్యాఅని అనుకుంటూఉంటే యిటీవల కొందరు సభలలో మాట్లాడడంబట్టి బయలుపడింది-

బలదేవ్ పతంగేఅనేవారున్నూ బహద్దరుయారుజంగుగారితెలిసె నగ్నోక్తిగా యీవిధంగా ఆర్యసమాజపక్షాన ఒకసభలో మాట్లాడుచూ జవాబిచ్చినారు

"హిందూ మతబోధ ప్రకారం విషముగల పాములకుకూడా పాలియ్యవలెను- ఎవర్తైతే తాము యితరులరక్తపిపాసులంఅని అనుకొనుచున్నారో వారినికూడా హిందువులు ప్రేమతో ఆహ్వానించుచున్నారు-పూర్వమునుండి హిందువులకు ముసల్మానులకుభేదంలేకుండెను-కాని మతం రాజకీయంచెందున్నా ఒకకొంటెవారే-యీమతాలవారిలో భేదాలుకలిగించినారు- ఆర్యసమాజంవారు చాలాత్యాగాలు చేసినారు-వారిలోవిముఖ్యులకు విషంపెట్టినారు- అయినా ఆర్యసమాజంవారు తమకపకారంచేసినవారినిక్షమించినారు హైద్రాబాదుహిందువులకు తమమిత్రహితులెవరో శత్రువులెవరో గుర్తించేనేర్పుకలదు"అని అతనుకూడా ఉపన్యాసం ఇచ్చినాడు.

ఇంకా మరికొందరు హిందువులు వేరువేరుసందర్భాలలో నవాబుగారి నర్మగర్భోక్తులతోకూడిననిందను ఖండించినారు.

నవాబుగారు తాము చాలా చాకచక్యంగల రాజకీయవేత్తనని అనుకొన్నారుకాబోలు- హిందువులనుండి ఆర్యసమాజమువారిని వేరుచేస్తే మంచిగాఉంటుందనుకొన్నారు కాబోలును-కానివారి ఎత్తుతప్పింది-అదియెదురుతిరిగింది- ఈవిధంగా అవాలోచితంగామాట్లాడితే వివాదాలు పెరుగుతవి, తగ్గవు.

హిందువులు నానావిధాలుగా చీలికలుచేసే ప్రయత్నాలు కొందరు చేతామనేఅలోచన కలిగియుండవచ్చును-లింగాయతులు హిందువులుకారనివారిలో కొందరన్నారు- కొంతకాలంక్రిందట సికింద్రాబాదు అంబేద్కరు సంఘమును కొందరుతేవదీసియుండిరికదా! మరి సనాతనులు ఒకదిక్కు ఏర్పడినారు- బహద్దరుయారుజంగుగారు హరిజనులను నౌముస్లిములుగాచేసినది ఎవ్వరున్నూ మరిచిపోలేదు-అది హిందూముస్లిం ఐకమత్యతకలిగించేదేనా? హిందువులు గులాములు మేము [అఖాలం] యజమానులంఅనినది ఇత్తెహాదువారు కలేకదా! అది హిందూముస్లిం ఐకమత్యతకలిగించునా? అనల్ మలికుసిద్ధాంతము సెవరులేవదీసిరి? ౨౦౦ఏండ్లనుండి దక్కను సుల్తానులటగా ముసల్మానులంతా! మరిసుల్తానులు గులాములతో పొత్తునుగోరుతారా? ఇవన్నియుతాముచేసి మరొకరిపైన నిందలుమోపుటవల్ల ఏంలాభం కలిగింది- ఐకమత్యంకోరి పెద్దమనిషిఅని మార్వాడీ మండలివారుపిలిచి గౌరవించితే ఆర్యసమాజాన్ని దూషణచేసి హిందువులను ముసల్మానులను వారిపై ఎగదోసే ప్రయత్నంచేయుట ఎం సమంజసమోయేమో! నవాబుగారికింకా అనుభవం కలుగవలసియుండును.

— — ఒక ఆర్యు

## స్థానిక వార్తలు

### పర్దా

మ-మ-వ- నిజాంగారు మెదక్కులో నిల్లువానీ వారు - ౭ఆబాన్ నాటి అరయగావ్రు వృవాటికయందు నచట "కంటకము లేని మొగ్గ రొక్కటియులేదు"

గోషాపద్ధతినిగురించి (మహమ్మదీయ మతస్థు లవరకుమాత్రము, కొందరువ్రాసినవ్రాతలు స్థానికపత్రికలలో ప్రకటించబడినవి, మాదృష్టికి వచ్చినవి- రెండుదృక్పథములుగల ఈసమస్యతెగినంతయాలోచనలేకయే పూర్వాపరసందర్భములను గమనించకయే పరిష్కారము చేయదగినదికాదుగనుక, ఈచిత్రమును విమర్శించువారు దానిరూపురేఖలను పరియయిగతెలుసుకొని పరిశీలించి అభిప్రాయముప్రకటించవలసియుండును. కావున, "ప్రస్తుతపరిస్థితులు" అట్టివిమర్శనాసవిమర్శనములకు అనుకూలము గాలేవు- ఏలయనగా ఈసమయముదానికి తగియుండలేదు- ఈకారణముచేత ఈవిషయమునుగురించిన వ్యాసపరంపరను త్రుంచివేయుట సమంజసము- ఏలయనగా ఈపనిలాభదాయకముకాదని తెలిసినప్పుడు ఇట్టివిషయములో ఇచ్చిపుచ్చుకొనుటలు మంచివికావు ఇంతేకాక తెలిసికొనవలసినసంగతి ఏమనగా ఇటువంటి కొన్నిసమస్యలు పరిష్కారముకొరకు "సూక్ష్మదృష్టి" నికోరుచున్నవి. విషయముయొక్క స్థానబలములను బాగుగాగ్రహించినవారై విద్యాసంపద, స్వకీయమేధాశైలమును కలిగియుండి "బయటప్రభావముల" నుండి తమ్ముతాము విడిగానుంచుకొనగలవారే ఈకార్యమును నిర్వహించకలిగియుందురు, అట్లుకాక, అట్టివిలేనిచో, కంటకావృతమగు మార్గమునపడచుటకు సామర్థ్యముకలిగియుండజాలదు, "అంతర్గర్భితవిషయములను" గ్రహించక అజ్ఞానవశమున కఠినకార్యమును సుఅభమని తలచుట తెలివిలేనివారియొక్కయు మందప్రజ్ఞులయొక్కయు లక్షణమై యున్నది. విజ్ఞానవంతులును, బుద్ధివంతులునగు వారి దృష్టిలోనిది పరిహాసపాత్రమును అనంగీకారార్హము ఐయున్నది. అన్నట్టు:-

"పూలవానన పెంటలో బుట్టబోదు"

### సైన్యాన్ని సాగనంపుట ప్రధాన మంత్రిగారిబోధ

హైదరాబాదునుండి యుద్ధానికై వెళ్ళు సైన్యమును ప్రధానమంత్రిగారు గతవారంతిలకించి యీవిధంగా వారి ఉపన్యాసమిచ్చిరి-

మీతో సంబంధము కలిగియుండుట మాకు చాలా ఆనందము- నావంశముకూడా శూరుల వంశము-నానరాలలో శూరులరక్తం ప్రవహిస్తున్నది- యీయుద్ధములో ధర్మం పశుబలంరెండున్నూ ఢీకొన్నవి. మీరు ఒక పవిత్రకార్యాన్ని నెరవేరుస్తున్నారు- మన ప్రభువుగారగు మ-ఘ-వ- ఏడవ నిజాంప్రభువుగారు బ్రిటిషువారు విశ్వాసపాత్రమిత్రులు- వారీయుద్ధసహాయంలో చాలాసహాయంచేసినారు- మీరున్నూ హైదరాబాదుపేరు నిలబెట్టిరావలెను- మీరువిదేశంలో పోయినప్పుడు ఒంటరిగా ఉన్నామకదా అని విచారపడకుడు మేమంతా మీక్షేమంకొరకై దేవునిప్రార్థిస్తూఉంటాము.

### బాలికల ఉన్నత పాఠశాల

(నారాయణగూడెము)

హైదరాబాదు(దక్కను) ౧౨-౯-౧౯౪౧ ఈరోజు మాపాఠశాల భవనమున శ్రీమతి బి-బి-హెచ్ ఖుర్‌షీద్ (ఇంతకుమునుపు దాదాభాయినౌరోజీ మెమోరియల్ అసోసియేషను సెక్రటరి)గారి యాజమాన్యముక్రింద దాదాభాయి నౌరోజీమహాశయుని జన్మదినోత్సవముజరుపబడెను-అధ్యక్షురాలు మూడులైబ్రరీకి రూ౧౦/-లు నొసగెను, బాలికలు ఇంగ్లీషులో తెలుగులోను శ్రీనౌరోజీ గుణగణములనుబోగడిరి-అధ్యక్షురాలి గంభీరోపన్యాసముతోను మంగళగానములతోను సమావేశము సమాప్తమయ్యెను.

### సర్ సయ్యద్‌రజాఅలీ

వీరుహైద్రాబాదుకు ౫ ఆబాన్ నాడు విచ్చేసిరి మూడిరెదక్కమరణానికి తమవిచారాన్ని స్వయంగా మ-ఘ-వ-నిజాంగారికి తెలుపుకొనుటకై వచ్చినారు. ప్రభుత్వాతిథిగానిలిచినారు. నాలుగుదినాలవరకుఉండి వెళ్లిపోవుచున్నారు

నవాబు ఛతారీగారివిషయమై వారిసంపూర్ణసమ్మతిని తెలిపినాడు. వారిప్రధానమంత్రిత్వకాలములో రాష్ట్రానికి మరలవృద్ధికలుగగలదని అభిప్రాయమిచ్చినారు.

## వృత్తివిద్య

హైదరాబాదు ప్రభుత్వమువారువృత్తివిద్యావ్యాప్తికై ప్రస్తుతం ౯౪ లక్షల ఖర్చుచేయుచున్నారు- ఏటేట ౪ లక్షల౫వేల వ్యయముచేయుదురు.

౨ వ్యవసాయపాఠశాలలను, ౮ మాధ్యమిక పారిశ్రామిక పాఠశాలలను, ఏర్పాటుచేయుదురు, ఒకవ్యవసాయపాఠశాల తెలంగాణాలోను ఇంకొకటి మరాట్వాడాలోనుఉండును ఒకటి వరంగల్ ఔరంగాబాదు పట్నాలలోఉండును-రాయచూరు, బీదు, కరీంనగరుజిల్లా నిర్మల్ పట్నాలలో పరిశ్రమల పాఠశాలలుండును అచ్చుకట్టుపని, చెక్కుపని,కంసాలిపని నేత, బొమ్మలుచేయుట నేర్పుదురు- బాలికలకుగాను గుల్బర్గా,బిదరు, ఔరంగాబాదులలో అద్దకం అచ్చువంట, నేత,బుట్టలల్లుట, బొమ్మలుచేయుట,కుట్టుట, నేర్పుదురు, హైద్రాబాదులో బాలికల పరిశ్రమపాఠశాలలో ౩౦౦ బాలికలకు చెప్పుటకు ఏర్పాటుచేసినారు-

### ఒకదినంశిక్ష

బాలకిష్టయ్య అనేఉపాధ్యాయుడు కొన్నినెలలక్రిందట ఒకసభలో ఉత్సాహమెక్కినవై ఏవో కొన్ని నోటికివచ్చినపాటలుపాడినాడు అవిమతద్వేషంపురికొల్పునని అతన్నిఆరెస్టుచేసినారు ఉద్రేకం చల్లబడినతర్వాత తానుతప్పుచేసినానని గ్రహించి కోర్టులో క్షమాపణవేడుకున్నాడు కోర్టువారున్నూ అనుగ్రహించి ఒకదినం జెయిలుగాలిచూపించి అతన్నివదలివేసినారు-

### రూ౧౨౦౦౦ల అపహరణము

హైదరాబాదు-దక్కను నగరములో హుసేనిఆలం టప్పాఖానాలో రూ౧౨౦౦౦లు లోటుకనిపించగా, దానివిషయంలో నగరపోలీసు, ఖుఫ్యాఖాతావారు ఈఅబాను౨నతేదిన ఆటప్పాఖానాముసీఅగు గులాంమొయినుద్దీన్ గారిని పట్టుకొని, పరిశోధనజరుపుచున్నారు. ఈద్రవ్యములో మనియార్డరులపైకము భీమాలపైకము మున్నగునవి చేరియున్నవట. (ఆ-ప్రె)

### దసరా ఊరేగింపుఅనుమతికై ప్రయత్నము

ఈఅబాను౨నతేదిన హైదరాబాదుదక్కను నగరమందలి కిషన్‌గంజుఆర్యసమాజములో నగరములోని అన్ని ప్రాంతములఆర్యసమాజ కార్యదర్శులు సమావేశమైరి. ఈసారి దసరా ఊరేగింపును కత్తులు లాఠీలుధరించి జరుపుకొనుటకు ప్రభుత్వమువారు అనుమతినివ్వచో ఆఊరేగింపునకు శ్రీశంకరరెడ్డిగారిని నాయకునిగాచేయవలెనని అనుకొనిరి. ఊరేగింపుకొరకై ప్రభుత్వానుమతిసంపాదించుటకై శ్రీవినాయకరావు విద్యాలంకారుగారిని ప్రయత్నించగోరిరి-

### లాతూరులో బహద్దర్ యార్‌జంగ్ గారి ఉపన్యాసము

లాతూరులో ఇత్తెహాదుల్ ముసల్మీను మహాసభలో నవాబ్ బహదర్‌యార్‌జంగ్ గారు రెండవఉపన్యాసంలో ఇత్తెహాదుల్ సభ కార్యకర్తలను గురించిచెప్పుచు సంఘముల అధ్యక్షులు సర్వాకాలములతో సంఘములసభలను తిరుపుచట్టివ్యవస్థఉండవలెననిచెప్పిరి తర్వాతహరిజనులవిషయములో వారలనాయకుడగు సోమానరావుగారుచెప్పినమాటలకు సమాధానమిచ్చుచు హరిజనులు రాప్రస్తులకు మాటనుతానుఒప్పుకొనవనియు, హరిజనులు ఇస్లామీపద్ధతులపైననే నడచుచుందురనియు, కల్మాలుచదువుచుందురనియు, అందు హరిజనులను తానుతినసొంతసోదరులనుగా భావించెదననియుచెప్పిరి. కల్మాలు చదువనివారి మానవసోదరులనుగా భావించెదననిరి. ఏవరు తనపగవారుకారనిరి, ఈశ్వరునిసృష్టిలో మానవులందరును ఏకకుటుంబములోనివారలేయనిరి. వజనులకు వేరొకచోటఆశ్రయములేదనియు, మహమ్మదీయమతమందేగలదనియుచెప్పిరి. ఇస్లాంమతముపైపగలేని కాఫిర్లనుమా మిత్రులనుగాభావించెదమనివారనిరి ఇకముందు హరిజనులనందరమహమ్మదీయులుస్నేహితులనుగా భావించవలెనని.హరిజనులనుహెచ్చరించుచు ఖాయదేమిల్లత్ గారు వారలకోడమీదపిల్లివాటంగాఉండరాదనియు, తనకరము ఎల్లప్పుడు మైత్రికైసిద్ధముగానున్నదనియు, ఎవనిహృదయములో కుట్రయున్నదో అతనికితనకరమే వరిపిడిరాయియనిచెప్పిరి.

### మక్కా-మసీదులో ప్రధానమంత్రిగారి ఉపన్యాసము

మొన్నటిఅబాన్ ౭ వతేది హైదరాబాదు(దక్కను) నగరములో మక్కా మసీదునందు ప్రధానమంత్రి ఛతారినవాబు గారు ఉపన్యసించుచు దరిద్ర ముసల్మానులకు సేవచేయుటకు ప్రయత్నించగలమనిరి. మతపక్షపాతములేకుండ తనకర్తవ్యమును నిర్వహించుచుండుగాకయనిరి.

## అమీన్‌గారి అమానుష చర్య

స్టేషనుకు పిలిపించి చావుదెబ్బలు కొట్టిరి.

(పెరుమాళ్ల ఖండేరావు)

బాడేపల్లి ౫-౧౨-౫౦ ఫ.

నేనున్ను శ్రీయుత జానపాటిసత్యనారాయణగారున్ను ౮-౧౨-౫౦ ఫ ఉదయం ౮ గంటలవేళ స్నానముచేసి యింటికి వచ్చుచుండగా, పోలీసుజవానొకడు మావద్దకువచ్చి నాతో అమీన్‌గారు పిలుచుచున్నారనియూ, వచ్చిమాట్లాడి వెళ్ళవలసినదనియు చెప్పెను, అతనిమాటపై, నేను అతనివెంటనే స్టేషను వద్దనున్న పోలీసు ఠాణాకు బయలుదేరి వెళ్లుచుంటిని.

అమీన్‌గారు సైకిల్‌పైజడిచర్ల వెళ్ళుచుండుట గాంచితిమి. మరొకజవాను మావద్దకువచ్చి అమీన్‌గారు తొందరపనియుండి వెళ్లిరనియు నిన్ను స్టేషనుకు తీసుకొనిరమ్మని చెప్పిరనియు మాతో చెప్పగా ముగ్గురము సైకిల్‌షాపువద్దకు వెళ్లితిమి నేనొకసైకిల్ తీసుకొంటిని. జవానొకసైకిలును ఎక్కడినుంచియో తెచ్చుకొనెను. మమ్ములస్టేషనువాకొకు సాగనంపి రెండవజవాను వెళ్ళిపోయెను.

స్టేషను హౌసుకు వెళ్లుదారిలోనే అమీన్‌గారి యిల్లుగలదు. యింటిముందర సైకిల్ దిగి యింటిలోనికివెళ్ళి అమీన్‌గారిని సందర్శించితిని- స్టేషనుకు వెళ్ళవలసినదనియు, యిప్పుడే వచ్చెదననియు నాతోచెప్పి, నావెంటజడిచర్లపోలీసు పటేలును పంపించెను, నేను పోలీసుజవాను పోలీసుపటేలు ముగ్గురము స్టేషను హౌసులోనికి వెళ్ళితిమి,

ఎట్టిచేయవద్దని వంతుఇయివ్వవద్దని కాంగ్రెసు ప్రస్తకములు పంచుతావా కాంగ్రెసుసత్యాగ్రహులవస్తే నీయింటిలోనుంచుకొని భోజనముపెట్టితావా అంటూతిట్లుపులుమూసి ౫౬ గుద్దులు కాళ్ళబూట్లతో చేతులతో తన్నిరి. గుద్దిరి దానితో నేను స్మృతతప్పిపడిపోతిని.

అర్ధగంటతరువాత అమీన్‌గారు స్టేషనుకువచ్చిరి. లోపలపడియున్ననన్ను బయటికిరాండా లోనికిపిలిపించిరి. ఏమికావలెననడిగిరి. నీళ్లు త్రాగుటకు కావలెనంటిని. తనయింటివద్దనుంచి నీళ్ళుతెప్పించియిప్పించెను. త్రాగితిని తరువాత అమీన్‌గారు "నీవుహిందువునగుట నీకుసత్యనారాయణకు కష్టకొప్పించుటలేదు కాంగ్రెసు సత్యాగ్రహులను యింటిలోనుంచుకొని భోజనముపెట్టెదరా ఫ్లోర్లో వెట్టిచేయవద్దని సాదరుయివ్వవద్దని కాంగ్రెస్ ప్రస్తకాలు యిస్తారా యిదుగో మా కానూను అంటూ చెప్పటమాపించి చెప్పుదెబ్బలు కావలెనా"అనిగర్జించెను. "యింతకుముందే చేయించితిరి. మీవంతువుంటే కానివ్వండి మీచిత్తం" అంటిని యిప్పుడే ఏమైనది అసత్యనారాయణతో చెప్పు బుద్ధికలిగియుండవలెను. లేకపోతే నీకైనగతివానికి అవుతుందనిచెప్పి- ఇక ఇచ్చట మీకేమైనయుండవలె. మేమైనాయుండవలె నవుచూ శ్రీసత్యనారాయణ గారికేగాక వారిభార్యపిల్లలను మర్యాదస్థు లనంనోటితో ఉచ్చరించరానిచనట్టిబాడబూతులుతిట్టిపొమ్మనెను.

నేను నా సైకిల్ తీసుకొని పోజాలకపోతిని. నాసైకిల్‌ను తీసుకొనివెళ్ళుటనుపోలీసుపటేలును నావెంటపొమ్మనెను- పోలీసుపటేలు జడిచర్ల పూరిబయటుదాకవచ్చి నాసైకిల్ నాకప్పగించి వెనుదిరిగి వెళ్ళిపోయెను.

ఇకముందేమికానున్నదో!

## ఆంధ్రమహాసభాధ్యక్షుని ప్రకటన

నిజాంరాష్ట్రజన సంమాధ్యక్షులగు శ్రీయుత రావి నారాయణరెడ్డిగారు ప్రకటననిమిత్తము ఈ క్రిందివార్తను మాకుపంపిరి-

మహబూబునగరం జిల్లాలోచేరిన బాదేపల్లిలో జరిగిన విచారకరమగువార్తను ప్రభుత్వము వారియొక్కయు ప్రజలయొక్కయు దృష్టికి తేవలసివచ్చినందుకు విచారించుచున్నారు. స్థానిక అమీన్‌గారు పోలీసుజవానుద్వారా స్థానికవర్తకులగు శ్రీయుత ఖండేరావుగారికి కబురంపి స్టేషనుకు పిలిపించి జవానుతో క్రూరముగా కొట్టించిరి-ప్రజాసేవకుడగుటయు ఈసవస్థానములోగుండా పాదచారులై ఢిల్లీకి వెళ్ళుచున్న బ్రిటిష్‌యిండియా సత్యాగ్రహులు బాదేపల్లికివచ్చినప్పుడు భోజనముపెట్టుటయనియు ఇట్టి ఘోరచర్య గావించుటకుకారణము- ఈనెల ౧౦ వ తేదీలలో హైదరాబాద్ పట్టణములో ఈముగ్గురుసత్యాగ్రహులు అరెస్టులుకొంటిని.అనుభవముకలిగినట్టియు బాధ్యతగుర్తెరిగినట్టియు ఈసత్యాగ్రహులకు ఈసంస్థాన వ్యవహారములలో పాల్గొనుఉద్దేశ్యము గాని,సత్యాగ్రహము గావించు వభిప్రాయముగాని లేదని తెలుసుకొంటిని- నేను ఖండేరావుగారి దెబ్బలను స్వయముగాచూచితిని- ఈనాటికికూడ ఈ సంస్థానములో యిట్టివిపరీతచర్యలు జరుగుచున్నవని వినుటకుఘోరముగా యున్నది- ప్రభుత్వము వారు విచారణగావించి ఇందుకుబాధ్యులైవారిపై తగుచర్య తీసుకొందురని నమ్ముచున్నాము-

(సం) ఆర్. యన్. రెడ్డి.

## అప్పారావుపేట

అప్పారావుపేట సువర్ణనదీతీరమున (బోథ్ తాలూకా) సుమారు అరువందల గృహసంఖ్యతో నొప్పారుచున్నగ్రామము. అమీన్ ఖానునుండి గిరివిక్రిందసంపాదించుకొని నిర్మలనేలిన వాంక్లేవాసియగు వెంకన్న సాహుకారు మేనల్లుడగు జగపతిరావుమామమరణానంతరము క్రీ.శ.౧౮౦౨లో నిర్మలయందనేక తటాకములువేయించి ఈ గ్రామపు పరిసరప్రాంతములనుండి పుట్టినసువర్ణనదికి అనకట్టలుకట్టి అచెరువులునింపించెనని చారిత్రగాధకలదు.

పూర్వమీగ్రామము నేకపేటలు గలిగి ఈప్రాంతమునకిరీటముగా అలరారెనుటకు శిథిలఖండములు కారణముగానున్నవి.

ఇది అబ్కారీశాఖ సబ్ఇన్స్పెక్టరు, అరణ్యశాఖచౌకీదారుల ప్రధానస్థలము. ఇటప్రాథమిక పాఠశాలయు, పరీక్షార్థమునిలిపిన తపాలాఫీసున్నవి

పరీక్షార్థము వచ్చుఅధికారులసౌకర్యమునకై డాక్ బంగ్లాలేదు-సమీపపుజనులీపల్లెలో దానిని కట్టించిరి. అరణ్యశాఖోద్యోగులకై రెస్టుహౌజు ఒకటికలదు.

వర్షములు చాలఆలస్యముగపడినను పువాసకనుకూలముగ పడుటచే రైతులముఖకములములువికసించినవి- కానిచెరువులోనికి నీరురానందున అబీఅలుకబడలేదు- వస్తువులధరలు తీవ్రముగానున్నవి-

సాంప్రదాయానుసారము తహసీలు అజ్ఞవలన భాద్రపద శుl ౧౦ నుండి సప్తాహము రైతులు చేయుచున్నారు

## ఒక దుండగీడు స్త్రీని మోసగించి తెచ్చుట

మహబూబునగరం ౨-౧౨-౫౦ఫ-

అవుసలగిరప్ప యనువతడు మహబూబునగరవాసి-ఇతనిఅత్త హైదరాబాదలోవున్నది-అక్కడికి కొన్నిరోజులకుముందు తనభార్యను పిలుచుకవచ్చుటకు వెళ్లియుండెను-వారితో చెప్పకుండగా వానిభార్యఅక్కయగు లక్ష్మమ్మదగ్గరకు వెళ్లెను- ఆమెభర్తశీతల్ సీయంగు షంకసేఠుహోటల్ సమీపములో ఒకబాడుగఇంటిలో కాపురమున్నాడు ఈగిరప్ప తనవదినెయొద్దికి భర్తఇంటిలోలేనప్పుడు వెళ్లి ఆమెఅమ్మ ఆమెను పిలుచుకరమ్మన్నదనిచెప్పి, మోసముచేసి మంగళవారమునాటి రాత్రి [-౭-౧౧-౫౦ఫ-]నాడు రైలులో ఇక్కడికి వచ్చెను-ఆమెతనను ఏల ఇచ్చటికి తెచ్చుచున్నాడనివిచారింప ఆమెతల్లి ఇచ్చటనేయున్నదని నచ్చచెప్పి ఒకభోగమువారిఇంటిలో దాచియుంచెను- తెల్లవారిఆమెభర్త ఆమెతగానక ఆమె తల్లియింటికి వెళ్లియుండునని తల్లిపోయి విచారించెను- అప్పుడునగరమంతయువెదకినను ఈగిరప్పగాని, యువతిగానియగుపడలేదు-తప్పక ఈతడే ఇచ్చటికి మోసముచేసి పిలుచుకపోయి యుండవచ్చునని భర్త,తల్లి,తదితరులు ఇచ్చటికివచ్చిరి- అతనినిఎంతఅడిగినను నాకు తెలియదనిచెప్పెను-వారినిగి ఇచ్చటి దర్జీసంఘమువారమగు మాకుతెలుపుకొనిరి- మేముపోయి అతనిని ఎంతబతిమాలినను ఆమెను ఎచ్చటదాచియుంచెనో తెలుపదయ్యెను- మేము ఒకపోలీసుజవానును తీసుకొనిపోయి భోగమువారిఇండ్లు వెదకితిమి- అచ్చటగానక తుదకు భుజంగులింగు అనువానియింటిలో ఆమెదొరికెను. ఆమెను ఆమె భర్తవెంబడి మొన్న శుక్రవారము మోటారుబండికిపంపితిమి-ఇతడు నమ్మకద్రోహియని వేరుగా చెప్పనక్కరలేదు.

ఇట్లు
దర్జీవారి సంఘము
మహబూబునగరం-
౨౭మంది సంతకములతో పంపబడినది-

## మద్య నిరోధము

వరంగల్ జిల్లా, మధిరతాలూకా, కేమిడిచర్ల గ్రామ మద్యపాననిరోధకసంఘ వార్షికోత్సవము రామున్నవిజయదశమికి జరుపుటకును, తత్సంబంధప్రబోధరచనలసేకరించి లిఖితసంచిక రూపమునకూర్చుటకును సంకల్పించితిమి, కావున బండితులును,కవులును, తదనుకూలములగు రచనలను ఈసంఘమువరకు వారముదినములలో నను గ్రహించి కృతజ్ఞతలకుపాత్రులుగాగలరని విశ్వసించు, మద్యపాననిరోధకసంఘము, కేమిడిచర్ల పోస్టు: కేమిడిచర్ల చll ౩-౧౨ ౫౦ఫ.

ఇట్లు
కృష్ణారావు
కార్యదర్శి

---

ఇటగల తెనుగునాటకమండలివారు మొన్న కృష్ణలీలనుప్రదర్శించిరి- మహారాష్ట్రపదములతోని బిడీకృతమైన తెలుగు మాతృభాషగాకల ఈ గ్రామస్థులు తెలుగునాటకములభ్యసించి ప్రదర్శనములుచూపుట చూచతే, గుబాసను చేయుచేయ ఎన్నతగినదిగానున్నది.

రఘునాథ్ రావుజోషి.
౨౯- ౧-౧౩౫౦ ఫ.

## యుద్ధంభర్తీదౌర్జన్యము

(ఓ-వి)

నిజాంపేట, తాలూకా మెదకులో ౨౧ మొహరు ౧౩౫౦ ఫసలీనాడుమహమ్మదుహుసేన్, మహమ్మదుకాజా అనుపేరుగల సిపాయీలు(నెం ౯౫౧౨౨౦ యం-టి,నెం ౫౫ ౭-పి-ఇ-టిపి) ప్రొద్దున ౧౦ కి నందిగ్రామంలోనికి భర్తీనిమిత్తము కుండికావలెనని గడబడచేసిరి గ్రామంలోనికి ౩ గురువగుకు మనుష్యులనుపట్టుకునేవరకు గ్రామజనులు ఆందరుభయపడి పలాయనంఅయిరి. తదుపరి అతనుపట్టుకున్న సివ్యాగౌడును ఒకదూదేకులవాడును చాకలివాడును ప్రతిమాలి కొన్నిముడుపులను చెల్లించుకొనిరి- ఇక్కడినుండి రోడ్డుపైయున్న గంగువారినిపట్టి కొలుచుకొని వారినిపైకమిస్తేవిడుస్తాను లేనితీరుకు వెనుకనుంచి రెండుమోటరులువస్తవి. అందులో వేసుకపోగలనుఅని బెదరించితే, వారుభయపడి పనసట్టిగావుండినంతలో వేరేమోటరువచ్చుచువివచ్చెను- అప్పుడుసిపాయివాడు నిజాంపేటలోనపురవాన ఆయినాడు వానివెంట ఒకమాదిగ. ఒకకూలియొందెపల్లివచ్చి గానంది గ్రామంవాడుండిరి- నిజాంపేట వారంగౌరయ్యను రోడుపైనపట్టుకొని అతనిదేహంకొలుచుకొని నిన్ను యుద్ధంనిమిత్తం పట్టుకపోతానని బెదరించగా, వాడు నేనుబీదవాడను అనియేమొర(ఒతిమాలినందున రు ౧౦ యిస్తేవిడుస్తాననిఅనుటవలన ఇపుడు నావద్ద లేవు గ్రామంలోయిస్తా రమ్మనిఅనెను, జవాను వెంటవచ్చెను గ్రామంలోకి ౧౨ గంటలవగవచ్చెను, రామిరెడ్డి (గుమాస్తమెం|కమాలి)చావిడివద్దవుండెను, అసిపాయి నందిగ్రామంమజ్కూరివానిని మాదిగవానివెంట కల్లులొట్టి యెత్తించుకొనివచ్చి పటేలుపట్వారి పోలీసుపటేలు ఎక్కడవున్నాడుఅనిఅడిగెను. నందిగ్రామం మజ్కూరివాడు ఇతడే మాలిపటేలుఅనిచూపించి, అయ్యా వీరుఫౌజజవాను మోటర్లువస్తువున్నవి. నందిగ్రామంలోమందిని పట్టుతున్నారు అనిచెప్పెను. మజ్కూరివానిమాటనమ్మి, అనగా ఒక్క మైలుసమీపంగ్రామంనుంకరివాడు చెప్పుటవలన మోసంలోపడి కొన్నంటి మళ్లిగా తెరుసిందనుపిలిపించి పోలీసుపటేలు రాంచెంద్రారెడ్డిగారిని పిలిపించుతే వారుఏదోపనిపయిన గ్రామంవెలుపలపోయినవారు, వెగిరంవచ్చిఅడిగితే ఒకఫారం ఇంగ్లీషులోవ్రాసినది సైన్యహాముచూపించి మందిని పట్టనిమిత్తం ఆజ్ఞఅయినదిఅని ఇంకాచాలా బెదరించెను తర్వాత ౫-౬మంది పట్టుకొని వారు ప్రాధేయపడగా వారివద్ద రూపాయీలు తీసుకొని పటేలపెట్టినాడు అదువరకే గ్రామంప్రజలు ఇండ్లు ముంగిల్లు పశువులను గొర్రెలను మేకలను వదలిపెట్టి ఆడవాండ్లను ఇంటిలోవుంచి కాలంకినీ మొగవాండ్లుఅంత ౬-౭-౮-౯-౧౦ మైళ్ల దూరం పలాయనంఅయినారు రూపాయిలు తీసుకొని మందినివిడుచుటవలన కొంతమందికిపూ భోఅయినాన్ని కచ్చేరిలోకితీసుకవచ్చి వానియొక్క సంగతులు తెలుసుకొని వీడు లపోటుఅనిగ్రామంవాడ్లు తెలుసుకొనినారు. అప్పుడువాడినిపట్టుకొనజానగా ఊరికపోకొచ్చెను మళ్లిపట్టుకొనివచ్చి పోలీసుఠాన రామాయంపేటకు కొందరు ప్రజలుపోయి దరకాస్తుయిచ్చి వెంటపెట్టుకొనిరి పోలీసుపటేలుగారుకూడ రిపోర్టుయిచ్చినారు అందువలన మొహరిర్ గారు ౨౨ మొహరు ౧౩౫౦ నాడువచ్చి విచారణచేయుచుంటువుండగా ౨౩ మొహరు ౧౩౫౦నాడు అమీన్‌గారు కార్యాయిచే నిమిత్తం మొహరిరుగారికి ఆజ్ఞఇచ్చిపోయినాడు, విచారణపూర్తిచేయుకొని మొహరిరుగారు ౨౪ మొహరు ౧౩౫౦నాడు రామాయంపేటకుపోయినాడు, జవాను పురుషత్వాపుగడగాపడి గాయబడి వచ్చినాగామంప్రజలుకొట్టినారు వచ్చి సైన్యానికి పంపుమనిఅంటే అదేప్రకారం పంపించినారు. తదుపరి ఏమికావాయి జరుగబోవునోపరమాత్మునికెరుక.

## ము. ఘ. వ. నిజాంప్రభుత్వ టపాని వేదిక

౧౩౪౯ ఫసలీ టపానివేదిక ఉర్దూలో ముద్రితమైనది- ౧౧౧౦ టపాశాఖలు రాష్ట్రములో ఉన్నవనియు ఈసంవత్సరం ౩౨ ఎక్కువగ చేసినారనియు తెలిపినారు-

# గద్వాలవార్తలు

(స్వ. వి.)

## సంస్థాన స్కౌట్లు

శ్రీయుత ఏ-బి- నరసారెడ్డి, స్కౌటుమాస్టరుగారు ౪౦ మంది స్కౌటుబాలురతో సహా ౧౫ సోమవారము అలంపూరునకు క్యాంపుగా వెళ్ళిరి. అలంపూరునందలి చారిత్రకమైన దేవాలయములనుజూచిరి. ౧౬వ తేదినాడు స్కౌట్లు అందరు అక్కడినుండి తుంగభద్రానదిదాటి కర్నూలునకు వెళ్ళిరి. ౧౭వతేదినాడుతిరిగి అలంపూరుకువాపసువచ్చి అక్కడపెద్ద స్కౌటుసభను చేసిరి. ఈ సభకు అలంపూరుతాలూకా తహసీల్దారు గారగు శ్రీయుత వాసుదేవరావుగారు అధ్యక్షతవహించి అలంపూర్, మునిసిఫ్ గారు, వకీళ్ళు, తదితర ప్రముఖులందరు అసభకువిచ్చేసియుండిరి. అక్కడనాసభలో ఐదుమంది "విద్య"నుగురించి "స్కౌటు ఉద్యమము"నుగురించియుపన్యసించిరి. ఆరాత్రిఅక్కడనే అగ్నేయ సభ Camp-fire) చేసిరి. దీనికిగూడ స్థానికపెద్ద మనుష్యులందరునువిచ్చేసియుండిరి, ఈ అగ్నేయ సభచాలాజయ ప్రదముగా జరిగినది. తరువాతిఅసభలో తమకుఅన్నివిధములసహాయపడిన శ్రీయుత వాసుదేవరావుగారికిని, శ్రీయుత వకీల్ సురవరం రాఘవరెడ్డిగారికిని, మౌల్వీ ఖదీర్ మియ్యాగారికినికృతజ్ఞతావందనములు శ్రీస్కౌటుమాస్టరుగారు అర్పించిరి. ౧౮వతేది క్యాంపుముగియగానే స్కౌట్లతోసహా వారిమాస్టర్లు గద్వాలకు వచ్చిచేరిరి.

## అనావృష్టి

గద్వాలలోగూడ అన్నిజిల్లాలలోవలెనే అనావృష్టివలన ప్రజలు చాలాబాధ పడుచున్నారు. శ్రీమహారాణీ బహద్దరుగారు వర్షముకొరకై ఒకసప్తాహమునుచేయించిరి. యెన్నిరోజులవారుణ జపములచేయించిరి. కానిదేవునికి కృపకలుగదయ్యెను. తుదకు మొన్న శేస్త్రవారమునాడు ఇక్కడ కుంభవర్షముకురిసినది. అందువలన పశువులకునీళ్లు, గడ్డి ఇంతో అంతో దొరకగలదు. యీవర్షము అదునుపై లేనందుచే రైతులపైరులుబాగా పండవనిఅనుకొనుచున్నారు. తాలూకుదారుగారుగూడ యీకరవు విషయములనుకనిపెట్టి తక్షణ మేచెరువుల కొల్వలపరమ్మత్తు మొదలుపెట్టవలయుననియున్నారు. వీటినిత్వరలోనేమొదలుపెట్టి బాధలుతొలగించెదరని నమ్ముచున్నాము,

## ఖద్దరువృద్ధి

గద్వాల ఖద్దరుపరిశ్రమకు చాలాప్రసిద్ధిచెందినస్థలము- ఇక్కడప్రతినెలకు వెయ్యిరూపాయీల ఖద్దరుతయారగుచుండెను. యిప్పుడు యీఒక్క ఆగస్టునెలలోమాత్రమే ౫౦౦౦ రూపాయీల ఖద్దరుసిద్ధమైనది. ఇకమీదప్రతినెలకుగూడ ౫వేల రూపాయీల ఖద్దరుతయారగునట్లు ఇక్కడిసంఘమువారు ఏర్పాటుచేసియున్నారు. దీనికై ఇక్కడిమేనేజరు శ్రీయుత గురునాధరావుపూజారిగారు ప్రశంశనీయులు. ఇప్పుడుఇక్కడకరువుబాధ మెండలైనందువలన చాలామంది బీదలు ఖద్దరునడుకుటకు కుతూహలులైయున్నారు- కాని వీరివద్దయిచ్చుటకు తగినన్ని రాటాలులేవు, యిందుకై శ్రీమహారాణీగారు త్వరలోనే ౫౦౦ రూపాయీలవిరాళము నివ్వనున్నారని తెలియుచున్నది.

## సంపూర్ణ రామాయణము

ఇక్కడికి మద్దికెరవాస్తవ్యులైన పుట్లూరు కృష్ణమాచార్యులవారు వచ్చియున్నారు. వీరు హరికథచెప్పుటలో చాల అనుభవజ్ఞులు. వీరుయిక్కడ ౪౫దినములవరుసగా సంపూర్ణరామాయణహరికథచెప్పినారు-వీరుచెప్పు హరికథ చాలాబాగుండెను-అందుచే వేలకొలదిజనులు వీరిహరికథను ప్రతిదినమువినుచుండిరి-తుదకు మొన్న శేస్త్రవారం నాటికి హరికథ సమాప్తిఅయ్యెను అదినమే యిక్కడ కుంభవర్షముగూడవచ్చెను-అందుచే మరుసటిదినము యిక్కడివారందరుకలసి సంతోషముతో శ్రీరామపట్టాభిషేకమహోత్సవము, బీద

## కాలేజి గరల్

స్వర్గస్థురాలైన శ్రీరాణివరలక్ష్మీదేవమ్మ బహద్దరుగారి శుభనామముతో యిక్కడ ఒక నాటకసమాజముగలదు-వీరు పోయిన శేస్త్రవారంనాడు నాటకప్రదర్శనముచేసిరి "కాలేజిగరల్" నాటకము చాలబాగుండినది-అందులో కాలేజిగరల్ పాత్రమునుధరించిన శ్రీమతిగౌరీదేవిగారు, విధవపాత్రమునుధరించిన పద్మాదేవిగారు తమపాత్రలను మిక్కిలిశ్లాఘనీయముగ అభినయించిరి- కాని యీనాటకసమాజమువారు రెండువిషయముల గమనింపవలసియున్నది

౧-యిందులో పురుషపాత్రలు ధరించినవారందరు అధ్వాన్నముగానున్నారు-వారిలో ఒక్కరుమాత్రమే పార్టుతప్ప తక్కినవారెవ్వరును స్టేజిపైయుండుటకు అర్హులుగారు-

౨-వీరి వేషము (Make up) వీరిద్రస్సు చాలఅధ్వాన్నముగా నుండెను-వేషమునకు తగిన భాషయెట్లనో అట్లేభాషకుతగినవేషముగూడనుండవలయును-లేనిచో ఆట రమ్యముగానుండదు-మొత్తముమీదవీరిఆట చాలబాగుండెను-యీకంపెనీని డైరెక్టుచేసిన శ్రీయుత నాగేశ్వరరావుగారెంతయు ప్రశంసనీయులు-వీరు త్వరలోనే తమ నాటకములు ఆత్మకూరుసంస్థానములో ప్రదర్శింపనున్నారని తెలియుచున్నది-వీరికిఅక్కడగూడ జయముకలుగునని నమ్ముచున్నాము-

## శ్రీ మహారాణిగారు

శ్రీమహారాణీబహద్దరుగారు హైద్రాబాదు [illegible] అసంతోషపూ అతి వైభవముగా జరిపిరి- యీహరికథను జయప్రదముగాచెప్పించినందులకు "శ్రీకృష్ణమందిరము" మెంబర్లెంతయు ప్రశంసనీయులు- పట్నమునకు వెళ్లియున్నారు- తాలూకుదారుగారుగూడ హైద్రాబాదుకు వెళ్లియున్నారు-గద్వాలలో గణపతినవరాత్రోత్సవములు చాలవేడుకగాజరుగును-అప్పటికి శ్రీ మహారాణిగారు యిక్కడికి రానున్నారని తెలియుచున్నది- దసరాసందర్భములో యిక్కడ పిల్లలకు ఫుట్ బాల్ ఆటలలో పోటీపందెములు ప్రతిసంవత్సరము జరుగుచున్నవి. యీసంవత్సరముగూడ ఆ ఆటలను జయప్రదముగాజరుపుటకు తగు యేర్పాటులు జరుగుచున్నవి-

## మోటారు ప్రమాదము

౨౨-౧౧-౫౦నాడు గద్వాల నుండి రాయచూరుకు పోవుచుండిన సర్వీసుమోటారు పల్టీకొట్టి వాగుగడ్డపడ్డకిందబడెను-ఐదుమందికి బలమైనగాయములు తగిలెను-ఆనాడు రాత్రి౧౧గంటలవరకు రాయచూరుచేరి వైద్యాలయములో ౧౫మందినిచేర్పించినది-గద్వాలనుండి రాయచూరుకుపోవుటకు మంచి రోడ్డులేదు-ప్రతిదినం మోటారులలో ౨౫మందికి వరకు ప్రయాణంచేయుచుందురు- ఈప్రమాదము యెందువలన జరిగిందో ప్రభుత్వము విచారించి ఇట్టిజననష్టం అమాయకులగు ప్రయాణికులకు ప్రాణాపాయం లేకుండా ఏర్పాటు చేయవలెను

# చేనేతపారిశ్రామికవర్గ పరిస్థితి

## యుద్ధమువల్ల కలిగినకష్టము

(దీకొండ శాయన్నగారు అఖిలభారత పద్మశాలి మహాసభాధ్యక్షుడు)

యుద్ధమునెపమున మిల్లుయజమానులు నూలుధరలను విశేషముగ పెంచిరి. పెంచుచున్నారు. మరియు యితరులగు ఎక్కువలాభమును పొందు దోపిడీకాండ్రు లాభమునెపమున గడచినరెండుమాసములు నూలుధరలురెట్టింపు, రేషం,పురియిలు, జపాన్ సిల్కుధరలు మూడు మూడున్నర రెట్లు పెంచిరి. ఈపెరిగినధరలకు నేతకాండ్రు నూలురేషం తీసుకొని బట్టలుతయారుచేసిన ఖర్చుపెట్టినడబ్బు వచ్చుటలేదు. ఈకారణము వలన లక్షలకొలది చేనేతవృత్తిగలవారి పరిస్థితి హీనస్థితికివచ్చినది. యుద్ధకారణమువలన విదేశనూలు పొందలగునవి వచ్చుటలేదు. ఈమాటవాస్తవము. వస్తువులధరలు విపరీతముగపెంచుట కేవలముస్వార్థలాభము నాశించుటయే పరదేశములనుండి వచ్చు వస్తువులధరలు కొంతవరకుపెంచుటయోగ్యము. కాని మనదేశమున పండింపబడుచున్న దూదినుండి తయారుచేయబడిన(౨౦,౩౦,౪౦,కౌంట్లు)నూలు ధరనుహెచ్చించుకారణము కనబడదు.

గడచినసంవత్సరము దూదిధర రు ౩౩౦-౦-౦ ఉండగ నెం౩౦ ఱ ౧౦పౌనులపెట్టిక ౬-౫-౦ లేక ౯-౦-౦పడుచుండెను-కాని యిప్పుడుదూదిధర రు-౨౩౦-౦-౦వుండగ అదేపెట్టిధర రు ౧౯-౦-౦వరకుపెరిగినది. ఇదిదోపిడీగాక మరేమి! రెండుసంవత్సరములనుండి శత్రువులమయములనూలు, జపాన్ రేయాన్, ఆర్టిఫిషియలుసిల్కు రెండు యిచ్చుట కసపర్చినపట్టికలోకలవు. ఇందువలన దోపిడీస్వరూపము గోచరముకాగలదు. నేత పారిశ్రామిక వర్గము మిల్లుల పిల్లుపోటీవలన దివాలాస్థితికివచ్చినది. నూలు రేషంరెండుధరలుహెచ్చుటచే నేతకాండ్రవర్గము బలహీనమైపోయినది. ఒకవైపు ధాన్యముమున్నగువాటికి ధరహెచ్చినది, హెచ్చుచున్నది. రెండవవైపున ముడిసరుకు(నూలు, రేషంవగైరాలు)ధరహెచ్చుటచే బట్టలు తయారుచేయబడినతరువాత ధరహెచ్చుటచే ఎవరునుకొనుటలేదు.

ఇటువంటికఠినపరిస్థితివలన నేతకాండ్రస్థితి అత్యంతశోచనీయమైనది. సర్కారువారు మిల్లుయజమానులకు బట్టలకై ఆర్డరుయిచ్చినందున వారలే యింబకల్లుమిల్లులవాడించి లాభమును పొందుచున్నారు నూలుధరలు ఎక్కువగా పెంచి విశేషలాభమును పొందుట వలన అనిష్టపరిణామము నేతకాండ్రవర్గమునకు కలిగినది.

సమస్తజనుల హితార్థము సర్కారువారు యితరవస్తువుల (ఔషధములు) మీద కంట్రోలు ఏర్పాటుచేసియున్నారు. అప్రకారముగానే ఈ వస్తువులవిషయమున త్వరలో విచారణచేసి కంట్రోలు ఏర్పాటుచేయకపోయినట్లయితే నేతకాండ్రకు మరొక తరుణోపాయములేదు. ఏవిధమైనలాభసంపాదన విషయమైనను ఏదోవక పరిమాణముండియున్నది. కాని యీ లాభమునకు దరిదాపులులేవు. ఈపోటీచేయు వ్యాపారులు నేతకాండ్రుకారు. కాని మిల్లుయజమానులలాభమురొక్క దుష్పరిణామము నేతకాండ్రపై ప్రత్యక్షముగకల్గుచున్నది. నేతకాడు స్వతః అశిక్షితుడు, బీదవాడుఅగుటచే యీవర్గమురొక్క వేదనవ్యక్తపర్చుటకు వేరొక సాధనము లేదు. నేతకాండ్ర వర్గమురొక్క పరిస్థితి యిట్లున్నదికదా ముడిపదార్థములు కొనుట నేతకానికవసరము-తయారుచేసినవస్తువుల నమ్ముటకూడ వానికే యవసరమైయున్నది. ఇటువంటిపరిస్థితులలో నేతకాండ్రవర్గమురొక్కజీవనమునకు వేరొక సాధనములేదు-కావున ప్రభుత్వమువారు యీవిషయమును గూర్చి త్వరితముగ నాలోచించవలెను.

### రేట్లు

(౧౯౩౯ జానైనుండి ౧౯౪౧వరకు)

సంవత్సరము-కృత్రిమపైనపట్టు (౧౦పౌనులుంగి)

| | | |
|---|---|---|
| ౧౯౩౯ | సింగిల్ | డబుల్ |
| ౧౯౪౦ | ౧౦|| | ౧౧|| |
| ౧౯౪౧ | ౧౨|| | ౧౨|| |

వెర్సనైజ్డ్ సిల్కు (౧౦పౌనులుంగి)

| సంవత్సరము | నెం. ౬౪ | నెం ౭౪ |
|---|---|---|
| | రు: అ. | రూ. అ. |
| ౧౯౩౯ | ౧౦-౧౨ | ౧౨-౬ |
| ౧౯౪౦ | ౧౨-౪ | ౧౫-౯ |
| ౧౯౪౧ | ౧౬-౭ | ౨౧-౬ |

నూలు (౧౦పౌనులుంగి) ౧౯౪౦లో

| నెం.౨౦ | నెం.౨౨ | నెం.౨౪ | నెం ౩౦ | నెం.౪౦ |
|---|---|---|---|---|
| రూ.అ. | రూ. అ. | రూ. అ. | రూ అ. | రూ.అ. |
| ౪-౩ | ౪-౧౧ | ౪-౧౫ | ౬-౬|| | ౬-౧౪ |

నూలు (౧౦పౌనులుంగి) ౧౯౪౧లో

| రూ.అ. | రూ. అ. | రూ. అ. | రూ.అ. | రూ. అ. |
|---|---|---|---|---|
| ౫-౧౨ | ౬-౦ | ౬-౪ | ౬-౧౧ | ౭-౧౩ |

---

౧ సంవత్సరము చందా
౬ రూపాయలు
౬ నెలలకు
౩ రూపాయలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౮-౦ కల్దారు
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

THE ONLY
POPULAR PAPER
THAT REACHES
The masses
In the Dominions
BEST MEDIUM
for
Advertisement.

**Volume 16** **Hyderabad-Dn** **Monday 15th September 1941** **Number 38**

## భారతదేశానికి క్రొత్తఆశ ఏదీలేదు

### బ్రిటిషుప్రధాని స్పష్టంగాచెప్పినారు

బ్రిటిషుప్రధాని చర్చిల్ గారును, అమెరికా సంయుక్త రాజ్యాధ్యక్షుడగు రూజ్వెల్టుగారును అట్లాంటిక్ సముద్రంమధ్యమున పరస్పరమంగీకరించి చేసినప్రకటనలోని ఎనిమిదిసూత్రాలు భారతదేశానికికూడ వర్తించునాయనిక్షేపలువురు కొంచెము ఆశతో జవాబునకై ఎదురుచూచుచున్న సమయంలో చర్చిల్ గారు సెప్టెంబరు ౯ వతేదిన బ్రిటిషుపార్లమెంటు "సమావేశమందుపన్యసించుచు అటువంటి క్రొత్తఆశలుపెట్టుకొనవలసినదని స్పష్టంగా చెప్పివేసినారు. వారిఉపన్యాసములో ఈ విషయమునకు సంబంధించినభాగము ఇట్లున్నది:

"ఆంగ్లేయులును అమెరికావారును కలిసిచేసినప్రకటన ఇండియాలోగాని, బర్మాలోగాని, బ్రిటిషుసామ్రాజ్యమందలి ఇతరదేశములోగాని రాజ్యాంగాభివృద్ధినిగురించి అప్పుడప్పుడుచేయబడియున్న విధానవివరణ ప్రకటనలను ఏవిధమునగాని మార్చదు. బ్రిటిషుసామ్రాజ్యములో స్వతంత్రమై సమానభాగస్వామ్యమును సంపాదించుటకై భారతదేశమునకు తోడ్పడెదమని మేము ౧౯౪౦ సంవత్సరపు అగస్టుమాసప్రకటనలో మాటనిచ్చియుంటిమి. భారతదేశముతో మాకుచిరకాలముగా సంబంధముండుటవలనవచ్చిన బాధ్యతలను, ఆదేశములోని నానామతములకును, జాతులకును, సంబంధీకులకును మేమువహించినబాధ్యతలను నెరవేర్చుటకు ఆటంకములుగలవంతవరకు ఈ వాగ్దానము నెరవేర్చబడుచుండగలదు.

"బర్మాకును, బర్మాస్వపరిపాలనమును స్థాపించుటకుగాను మేమాలోచించి నిర్ణయించిన విధానమున్ను, అప్పుడే సాగించబడుచున్న చర్యలును వర్తించును.

"అట్లాంటిక్ సముద్రమువీద జరిగినసమావేశములో ఇప్పుడువాశీలవశమైన యూరోపుఖండ రాజ్యములు, జాతులసంపూర్ణస్వతంత్రరాజ్యత్వమును ప్రజాస్వపరిపాలనమును, జాతీయజీవనమును పోషించుటయునుసంశయమున్ను, దేశములసరిహద్దులలో చేయవలసియుండు మార్పులను ఏ సూత్రములకుబద్ధులైచేయవలెననుసంశయమున్ను మాకు ప్రధానముగ మాఉద్దేశ్యములైయుండెను. అవిపూర్తిగా వేరేసమస్య. దానికిని బ్రిటిషుప్రభుత్వముక్రిందబడినట్టి ప్రజలుగల ప్రాంతములలో స్వపరిపాలనసంస్థల క్రమాభివృద్ధిసమస్యకును సంబంధములేదు. ఈవిషయములనుగూర్చి మేముచేసినప్రకటనలున్నవి. అవిఏప్రదేశములను, ప్రజలనుగూర్చిచేయబడినప్రకటనలు ఆయాప్రదేశములు, ప్రజల పరిస్థితులకే సంబంధించినవి. అవిసంశయాస్పదములుగాని అర్థములుగలిగియున్నవి, ఇప్పటిసంయుక్త ప్రకటనలు సరిగాసరిపోయినవిగానే కనిపించగలదు."

### గాంధీమహాత్ముని మౌనము

మదరాసులోని హిందూపత్రికయొక్క విలేఖరి గాంధీమహాత్మునిదర్శించి చర్చిల్ గారిపార్లమెంటుఉపన్యాసమునుగూర్చి ప్రశ్నలువేయగా మహాత్ముడు సమాధానముచెప్పజాలనసెను. నేనుఎంతోముఖ్యములైన, సందర్భద్ధములైన ప్రశ్నలనువేసినాను. వాటికిసమాధానము చెప్పుటమీకిష్టములేనట్లున్నది. మీరాయివాకానము కాంగ్రెసువేపునకైపోరాడుచున్నదో అభారతీయస్వాతంత్ర్యోద్యమమునకు సహాయమని మీరు నిజంగా నమ్ముచున్నారా? అని విలేఖరిఅడిగెను. అందుకు గాంధీ మహాత్ముడు ఇట్లుసమాధానమిచ్చెను. "వాక్స్వాతంత్ర్యముకోరేనిచో మీరుఅడుగకుండానే నేను ఒకప్రకటనచేసి యుండెడివాడను. కాని వాఖ్యానము నేను ఇపుడుచెప్పవలసిన మాటలకంటె ఎక్కువప్రభావముగలదని నిజముగా నా నమ్మకము. మాటలతో ప్రయోజనములేదు, క్రియఅన్నిటికంటె ముఖ్యము నాక్రియ భారతదేశమునకు, మీకిష్టమైనచో యావత్ప్రపంచమునకు కూడ అనిచెప్పకొనవచ్చును."

### కృపలానిగారి అభిప్రాయము.

కాంగ్రెసు కార్యదర్శికృపలానిగారు ఈక్రింది అభిప్రాయమిచ్చినారు- "అట్లాంటిక ప్రకటననుగురించి విమర్శచేయునపుడు నేను అదిభారతదేశమునకు ఏమాత్రముగాని వర్తించుచో భారతమంత్రిచేసినట్టి ప్రకటనను చేసియేయుండవని నేను చెప్పియుంటిని. ఈయుద్ధ శాంతిసూత్రములుభారతదేశానికి ఏమాత్రముగాని వర్తించుచో భారతప్రభుత్వమొక్క వర్తనమునందు దానికిగట్టిదర్శనము అగుపడియుండును. అయినను కొందరు ఈయుద్ధసూత్రములు భారతదేశానికికూడవర్తించునని నమ్మిరి, ఈ సుఖస్వప్నులకిపుడు గొప్పఆశాభంగము కలుగగలదని భయపడుచున్నాను అయినప్పటికిని వారలు గట్టిపనిఏదియు చేయజాలనందువల్లనే బ్రిటిషుప్రభుత్వ ఉద్దేశ్యములందువారికి గట్టివిశ్వాసము ఏర్పడియున్నది, కాబట్టి, వారలింకను అవిశ్వాసములను పదలక అంటుపెట్టుకొని యుండగలరు,

"కాంగ్రెసుమాత్రము చర్చిలుగారు ఇంతస్పష్టముగా చెప్పినందుకు సంతోషించును; యుద్ధములో ఏమిజరిగినదతవచేతనైనంతకాలము భారతదేశమును దాస్యములోనుంచుకొనుటకుగట్టిపట్టుతోనున్నది అదృష్టవశమున జాతులగతులు ఎంతగొప్పవారలైనను వ్యక్తులనాశ్రయించియుండవు. వారలెంతమంచి ఉపాయములనేర్పరచుకొన్నను ప్రజలనిశ్చయముచే అవిభగ్నములుకావచ్చును, సామ్రాజ్యముకారము బ్రిటిషువారిచైతేనేమి. మరెవరిచైతేనేమి దానితోసమాధానములేదని భారతదేశముస్పష్టముచేసినది.

### మున్షీగారు.

కె- యం- మున్షీగారిట్లుచెప్పినారు. "మానవస్వాతంత్ర్యమును గూర్చిరూజువెల్టు చర్చిల్ గారలుకలిసి చేసినప్రకటననుగురించి నాకుఇదివరకే ఎట్టిభ్రమగానిలేకుండెను- అంతలావుగా ప్రచారముచేయబడిన ఆప్రకటనఉత్త చిత్తకాగితమనిచర్చిల్ గారు స్పష్టముచేసినారు."

### వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారు

రైట్ ఆనరబిల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారిట్లు అభిప్రాయమిచ్చినట్లు హిందూపత్రికలోనున్నది. ".........భారతదేశపు కోరికను వారు (చర్చిల్ గారు) నిజమైనఆదరముతోను దాక్షిణ్యముతోను ఎన్నడును ఆదరించినదిలేదు. వారిసంగతి తెలిసినవారింతకంటె మంచిదివినగలమని ఆశపడజాలరు- వారు బాధ్యతకుజడిసేవారు కారు- అయినను వారుకూడ ఈభూలోకజనులలో కంకోట్లమందికి అట్లాంటిక్ సముద్రపుసమాధానముకల్ల కలిగేలాభాలు వర్తించవని చెప్పే భారమును తనపెత్తిపైనవేసికొనుటకు ముందుక్రుంగిపోగలరు- వారినిగాని వారిపరిపక్షమున భాషించిరో వారలనుగాని ప్రపంచప్రజాభిప్రాయము ఎదుట దోషులనుగచేసి శిక్షించుటకైననూ ర్గమున్నదా? ఆప్రధానమంత్రి, ఇండియామంత్రి, వైస్రాయిగారల త్రయము భారతీయాశయములకు అశుభసూచకమనివాకుతోచినను కష్టమయినది ఈదురదృష్టస్థితికి భారతీయ నాయకులుబాధ్యతను తప్పించుకొనజాలరు- ఒకరేమో భారతదేశానికి ప్రజాస్వామ్యవిధానము పనికిరాదనుచు, దేశమును భాగములుగవిచ్ఛిన్నము చేయవలెనందురు. మరొకరేమో ప్రపంచమాతకు క్రొత్తసువార్తనిచ్చెదనను మానవప్రకృతిలో అవసరమగుమార్పుకలుగుటకై భగవంతునిపైభారముంచి వేచియుందురు. గొప్పదేశభక్తిఎంతయున్నను వివేకము, యథార్థస్థితిపరిజ్ఞానములేనప్పుడు, దేశమునకు అగణ్యమయినహానికలుగునను చేదుపాఠమును నేర్పుకొనుటయయినది."

### సావర్కారుగారి అభిప్రాయము

సావర్కారుగారు ఈక్రింది అభిప్రాయమునిచ్చినారు. "నేనురూజ్వెల్టుగారికి పంపిన తంతిసందేశము అమెరికాలోను, ఆదేశ ఇతరదేశములలోను బాడ్ కాస్టుచేయబడినట్లు తెలిసినది. చర్చిలుగారు ఇంగ్లాండు, అమెరికాలు కలిసిచేసిన యుద్ధాశయప్రకటనముపై కావలెనని కప్పియుంచినఆవరణమును తనసొంతచేతితోనే తొలగించుటకు ఒత్తిడికలిగించినఅంశములలో అమెరికాదేశము నిశ్శంకయముగా ఒకటైయుండును, ఇంగ్లాండు, అమెరికాలప్రకటన నాజీల ఆక్రమణలోపడిన దేశాలకుమాత్రమే పోగొట్టుకొన్న స్వతంత్రరాజ్యత్వమును, ప్రజాస్వామ్యమునుతిరిగియిప్పించుటకు (అధమపక్షము చర్చిల్ గారిచేనైనను) ఉద్దేశించబడినదిగాని, ఇండియాకుగాని ఆసియా ఆఫ్రికాలలోని దేశాలవంటివాటికిగాని ఉద్దేశించబడలేదని వారిపుడు కొరటుగాననిశ్చయమను భయపడక చాటుకొనకుండా ప్రపంచానికిచెప్పినాడు.

"అధమపక్షము హిందూమహాసభకైనను అదిక్రొత్తసంగతికాదు. యుద్ధప్రారంభమపుడే అది అన్నిపార్టీలవారికిని హెచ్చరికచేయుచు, యుద్ధముచేసే ఏదేశముగాని, అధికారరహ్యమూడ ఇతరులకు స్వాతంత్ర్యమును, ప్రజాస్వామ్యమును పునరుద్ధరించు పరోపకారయత్నములో లేదనియు, అట్టిదేశములో ప్రతిజ్ఞలేయు తనతనసొంతఅవసరమునకేదికునియు చెప్పియుండెను-

"ఇంగ్లాండు, అమెరికాలప్రకటనలకు చర్చిల్ గారుచేసిన అర్థమును రూజ్వెల్టుగారు ఖండించుకోరక సమ్మతించునో చూడవలసియున్నది. ఎట్లయినను, ఈవిషయములో చర్చిల్ గారిప్రకటన రూజ్వెల్టుగారు మౌనముదాల్చుటకు వీలుగాకుండచేసినా, గొప్ప ప్రజాస్వామికవ్యవస్థకు అధ్యక్షులైనందుకు వారు తమమనసులోనున్నదానిని వెల్లడిచేయవలెను. వారిపుడు మౌనము దాల్చినచో అమెరికాసంయుక్త రాజ్యాధ్యక్షుడు అక్కడచర్చిలుగారు డిక్టేటుచేసినదానికి ప్రక్కతాళంవేయుటకో, వేసుకుండుటకోమాత్రమే అక్కడవుండినది అనిమాత్రమేతేలును."

### యుద్ధప్రతికూల సత్యాగ్రహివిడుదల

యుద్ధప్రతికూల సత్యాగ్రహముచేసి ఒకసంవత్సరముకఠినకారాగారవాసశిక్షవిధించబడి నాగపూరులో సెప్టెంబరు ౧౦ వ తేదీవరకు శిక్షననుభవించుచుండిన మధ్యరాష్ట్రశాసనసభ్యులగుఅసెంబ్లీయొక్క అధ్యక్షుడు ఘనశ్యా. మదాను గుప్తగారు అనారోగ్యములోఉన్నందువల్ల ఆనాటిమధ్యాహ్నము అధికారులచేతవిడుదలచేయబడినారు- అప్పటికివారింకను ఒకనెలశిక్షను అనుభవించవలసియుండెను- గుప్తగారు మేయో అస్పత్రిలో పోయిచేరిరి-

### కొచ్చినుకు ఆంగ్లేయదివాను

కొచ్చినుసంస్థానమునకు అధికారు ఏ-యఫ్-డబ్ల్యు- డిక్సు ఐ-సి-యస్ గారు రెండేండ్లకాలముదివానుగా నియుక్తులైనారు- వీరుసెప్టెంబరు ౯ వ తేదివరకు మదరాసు ప్రభుత్వస్థానిక స్వపరిపాలకశాఖకు కార్యదర్శిగనుండిరి- వీరిపుడుఒకనెలసెలవులోఉన్నారు- ఈసెలవుపూర్తికాగానే వారుదివానుఅధికారమును స్వీకరించగలరు-

### మరొకయుద్ధ సత్యాగ్రహి అనారోగ్యము

యుద్ధప్రతికూల సత్యాగ్రహముచేసి శిక్షననుభవించుచున్న భూలాభాయిదేశాయిగారికి ఇపుడు జెత్తురుపోటు ఎక్కువగా ఉన్నట్లు తెలియుచున్నది వారు ఎర్రవాడ జెయిలులో ఉన్నారు- వారినికూడ త్వరలో వదలివేయవచ్చునని పించుచున్నది-

### మధ్యరాష్ట్రములో మూడవతరగతి ఖైదీలు

ఇటీవల మధ్యరాష్ట్రమునందు మూడవతరగతి సత్యాగ్రహిఖైదీలు నాగపూరుజైలులోనున్నవారలు తమకుఎండాకాలమునకై ఇచ్చుచున్న పాలసప్లయిఆపబడినపుడు నిరశనదీక్షబూనియుండిరిగదా. గాంధీమహాత్ముడు వారలను నిరసనదీక్షమానవలసినదనికోరుచు, ఖైదీలకు పాలిచ్చేవిషయములో సమర్థులైనవైద్యుల అభిప్రాయమును పాటించవలెనని సూచనగాచెప్పియుండిరి. అందుపై జైళ్లఇన్స్పెక్టరు జనరలుగారిపుడు సమర్థులైనవైద్యులను ఈవిషయములో అభిప్రాయమడుగుచున్నారు మరియు ప్రభుత్వమువారు ఇపుడు మూడవతరగతి ఖైదీలకుఇచ్చుచున్న ఆహారముసరిపోవునా సరిపోదా అనుసంగతినికూడ సమర్థులగువైద్యులనుఅడుగుచున్నారు,

అగస్టు ౩౧వతేదిన మధ్యరాష్ట్రములో ౩౬౫ మంది రాజకీయఖైదీలుండిరి. వారలలో ౧౯౫ మంది సెక్యూరిటీఖైదీలు ౧౦ మంది మొదటితరగతిఖైదీలు, ౧౧౩ మంది రెండవతరగతిఖైదీలు. ౨౩౭ మంది మూడవతరగతిఖైదీలు. శాసనసభాసభ్యులు ౯ మంది జైలులోనున్నారు,

### సత్యాగ్రహులకు మినహాయింపు ఒసగు సమయాలు

ఏసత్యాగ్రహిగాని ఏకారణముచేతనైన తాము తమసత్యాగ్రహముచేయుట ఇష్టములేదని చెప్పినచో అతనిపేరును సత్యాగ్రహుల పేరులలోనుండి తొలగించవలెననియు, అట్లుగాక, స్వయముగా సత్యాగ్రహముచేయుట కిష్టమున్నవారలైనను తమకంటె పెద్దకాంగ్రెసుఅధికారిచేఏదో అసాధారణకారణములచే సత్యాగ్రహముచేయుటకు అనుజ్ఞ ఇవ్వబడనివారలు సత్యాగ్రహమునుండి మినహాయింపబడినవారుగ ఎంచబడవలెననియు, అవసరమనిపించబడినపుడు వారలు సత్యాగ్రహముచేయుటకర్హులనియు గాంధీమహాత్ముడు తమకిచ్చిన రాష్ట్రకాంగ్రెసుసంఘాధ్యక్షునికి ఒకలేఖలోవ్రాసినారు.



Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B. L.

# ఇండియావిషయమై బ్రిటిషుప్రభుత్వవైఖరి

## కామన్సుసభలో లేబర్ పార్టీసభ్యుల ఆక్షేపణ

లండనులో సెప్టంబరు ౧౧వ తేదిన పార్లమెంటు కామన్సుసభచే ఇండియాలోను, బర్మాలోను ఎన్నికలఆపుచేయుబిల్లుయొక్క మూడవప్రతిపాదన ఆమోదింపబడెను. బర్మాప్రజాప్రతినిధి సభజీవితము, భారతదేశమునందలి ౧౧ రాష్ట్రములయందలి శాసనసభలజీవితములు ఈబిల్లుద్వారా యుద్ధముముగిసినతర్వాత ౧౨ నెలలవరకువృద్ధిచేయబడుచున్నవి.

### ఆమెరీవివరణము

ఇండియామంత్రిఅమెరీగారుప్రతిపాదనము గావించుచు, యిట్లనిరి:

"బిల్లు ఆమోదింపబడునో, బిల్లులో నిర్దేశింపబడినకాలముకంటె పూర్వము యెట్టిసందర్భములలోనుకూడ ఎన్నికలుజరుపబడవని సభవారు తలపరాదు, వినను, యెంతకాలమువరకు ఎన్నికలుజరుపకుండుటవసరమగునో ఆకాలమంతటికిని యేర్పాటుచేయుటుచితమని తలంపబడెను. యుద్ధానంతరము ౧౨ నెలలవరకు ఎన్నికలు జరుగకుండుటకు బిల్లులో ఏర్పాటెందుకుచేయబడెను? అనిఅడుగవచ్చును. ఇందువిషయమైయేముకొందరిని ఆలోచింపగావారిట్లుసలహానిచ్చిరి, ఎన్నికలసర్వసాధారణముగా చలికాలములోజరుపుట సుకరము గానుండును. ఈయుద్ధము సంవత్సరములో నే ముగుపునందు అంతమగునో మనము చెప్పలేము కావున యుద్ధానంతరము ౧౨ నెలవరకు అపుచేయుట ఉచితముగానుండును" ప్రజలదృష్టిఎన్నికలపైపుమరల్చుచో యుద్ధప్రయత్నమునకు అటంకముకలుగునని యిచ్చట మనము తలచితిమి. ఈసిద్ధాంతము భారతదేశమునకుకూడవర్తించును. ఇదివరకే అచ్చటప్రభుత్వమువారిని ఉద్యోగులకు ను పనివిపరీతముగా హెచ్చినది. ఎన్నికలు జరుపుచో వారికిపనిమరింత హెచ్చును. అదిగాక, ప్రస్తుతసమయమున భారతదేశములో కొన్నిప్రాంతములయందు మతవైషమ్యము ప్రబలియున్నది, ఎన్నికలసందర్భమున సభలు,ఉపన్యాసములు జరుగుచో ఈమతవైషమ్యము హెచ్చవచ్చును. మరియు కొన్నిరాష్ట్రములలో కాంగ్రెసుమంత్రులును, కాంగ్రెసుసభ్యులును ఉద్యోగములు మానుకొనుటచేత, రాజ్యాంగవిధానము రద్దుచేయబడినది- ఈరాజ్యాంగప్రతిష్టంభనముండువరకు ఎన్నికలుజరుపుట హాస్యాస్పదము గానుండును. ఎందుకనగా, ఎన్నికలతరువాత రాజ్యాంగప్రభుత్వము యేర్పడునవకాశము లేకపోగా, గాంధి గారిసహాయనిరాకరణమార్గమును సభలలోను, ఉపన్యాసములలోను ప్రకటించుట సంభవించును. బర్మాలో సెప్టెంబరు, అక్టోబరుమాసములలోఎన్నికలు జరుపబడవలసియుండెను. కానిదూరప్రాచ్యమున అనిశ్చితమగుస్థితి యేర్పడుటచేత ఎన్నికలనుఆపుచేయుటఉచితము, అవసరముకూడ నయ్యెను-

అమ్మన్ గారుపన్యసించుచు "భారతదేశమునకును బ్రిటిషిప్రభుత్వమువారికిని సంబంధములు- యిప్పటికంటె అనుకూలముగానుండినచో బాగుండెడిది- ఇప్పుడుఅనుకూలభావము లేకపోవుటవలన, మనకుసంపూర్ణముగా సహాయముకలుగుటలేదు- యుద్ధప్రయత్నములో భారతప్రజలుమనకు హృదయపూర్వకముగా తోడ్పడుటలేదు- అని లేబర్ పార్టీసభ్యుడగు అమ్మన్ గారుచెప్పిరి- ఇదియెట్లున్నను యుద్ధావసరములనుబట్టి ఎన్నికలను ఆపుచేయుటవసరమగుచున్నది. కానికేవలము యుద్ధావసరములవలనమాత్రమే భారతదేశములో ఎన్నికలనుఆపుచున్నట్లు నాకుతోచుటలేదు భారతదేశములో రాజ్యాంగవిధానము రద్దుచేయబడినందునను, కొన్నిరాష్ట్రములలో అసంతృప్తి ప్రబలుటవలనను ఎన్నికలనుఅపుచున్నట్లు నాకుకనబడుచున్నది అనిచెప్పిరి.

### వింటర్ టన్ ప్రభువు

దురదృష్టవశమున భారతదేశములో యేర్పడిన రాజ్యాంగప్రతిష్టంభనము మూలకముగా సేవలో చేయువారు తగ్గుటగాని, ఆయుధసామగ్రి ఉత్పత్తి తగ్గుటగాని జరుగలేదని వింటర్ టన్ ప్రభువు ప్రత్యుత్తరమొసంగెను.

### లేబర్ సభ్యుని తీవ్రవిమర్శ

లేబర్ పార్టీసభ్యుడగు సిల్వర్ మెన్ గారిట్లు చెప్పిరి: "ఈదేశములో మనము మనకువర్తింపజేసినదానికే ఈబిల్లుద్వారా భారతదేశమునకువర్తింపచేయుచున్నామని చెప్పబడెను- కేవలము పైకిమాత్రమే యిదినిజము-కాని లోతుగా నాలోచించినచో నిజనిజముకాదని స్పష్టముకాగలదు-తనజీవితకాలమునుపొడిగించుటకు నిర్ణయించినదికామన్సుసభయే భారతశాసనసభలు తమజీవితకాలమును పొడిగించుకొనవలెననికోరుచో ఈసభలో జరిగినదానికిని భారతదేశస్థితికిని సామ్యముండెడిది- తనజీవితమునుపొడిగించుటకై ప్రజాప్రతినిధి ప్రభుత్వముకల ఒకశాసనసభ ఈబిల్లునుచేయుటలేదు- బ్రిటనుభారతదేశముపై సామ్రాజ్యాధికారము నెరపుచున్నట్లు యిది స్పష్టము చేయుచున్నది నిరంకుశము గాను, స్వతంత్రముగాను బ్రిటనుఇండియాపై పరిపాలనము నెరపుచున్నట్లు యిది స్పష్టము చేయుచున్నది- బ్రిటను సర్వాధికారమునకును నియంతృత్వమునకును యిది చిహ్నముగానున్నది ప్రజలు తమస్వకీయాభిప్రాయమును తెలియచ్చకుండచేయుటకిది యేర్పడియున్నది- భారతదేశములో మతకలహములుఅగువరకు ఎన్నికలను అపుచేయుటకేబిల్లు ఉద్దేశింపబడియుండలేదు. యుద్ధానంతరము ఒకసంవత్సరమువరకు ఎన్నికలను ఆపుటకు ఈబిల్లుఉద్దేశించుచున్నది- భారతదేశములో మతవైషమ్యము యుద్ధమువలనకలిగినదికాదు యుద్ధముముగిసినప్పుడు మతవైషమ్యముతగ్గదు-యుద్ధము రేపు అగిపోవచ్చును-భారతదేశప్రజలకు స్వపరిపాలనాధికారమిచ్చుట కేదైనను చేయువరకు భారతదేశస్థితి యిప్పటివలెనే యుండును-

### సర్ స్టాన్లీరీడ్ గారి ప్రత్యుత్తరము

వింటర్ టన్ ప్రభువు చెప్పినదానిని సర్ స్టాన్లీరీడ్ గారు సమర్థించిరి-ఎట్టిస్థితులలోనైనను భారతదేశమునందీబిల్లు అవసరమై యుండునవియు, అందున ప్రస్తుతస్థితిగతులలో నిది మరింత అవసరమనియు ఆయన చెప్పెను

### ఇతర లేబరు విమర్శలు

లేబర్ సభ్యుడగు సోరెన్ సన్ గారిట్లు చెప్పిరి "భారతదేశప్రజలు ఎక్కువమంది తమ పాలిసీని అత్యధికసంఖ్యాకులుగా నంగీకరింతురని ప్రభుత్వమువారికినిశ్చయమైనచో ఎన్నికలు తప్పక జరిపియుందురు-ఎన్నికలుజరుపుచో భారతదేశ ప్రజలు ఈప్రభుత్వమువారి కార్యవిధానమునకు విరుద్ధముగా వోటుచేతురనితలచి ప్రభుత్వమువారీ బిల్లును ప్రతిపాదించిరి- ఎన్నికలనుఅపుచేసి అట్లు అపుచేయుటకు మనమెంతమాత్రము నమ్మజాలని, కృత్రిమకారణములను చెప్పుటకంటె ఎన్నికలను జరుపుటే ప్రజాప్రతినిధి ప్రభుత్వపద్ధతికి యెక్కువ అనుగుణముగానుండును"

లేబర్ సభ్యుడగు ఎస్.జి డేవిడ్ గారుకూడ బిల్లునువిమర్శించిరి. ప్రభుత్వమువారు నిష్కపటముగావున్నా రాయను విషయము భారతదేశమునకు హక్కులివ్వు సందర్భమునను, రూజ్ వెల్టు-చర్చిలు ప్రకటనము వర్తింపజేయు సందర్భమునను విశ్వసముకావలసియున్నదని ఆయన చెప్పెను-"ఈదేశములో మనకు ఫాసిజముపై నెంత అసహ్యభావముకలదో భారతదేశములో కూడ అంత అసహ్యభావమేకలదు-ఇట్టి భారతదేశప్రజలను స్వాతంత్ర్య పోరాటములో ఎమెరీగారు చేర్చుకొనగియున్నారు- వాషరతులులకల అట్లాంటిక హక్కులపత్రమును భారతదేశమునకు వర్తింపజేయుట మనపవిత్రధర్మమైయున్నది."అని డేవిడ్ గారు చెప్పిరి.

ఇండిపెండెంటు పార్టీవారగు వార్నేగా రుపన్యసించుచు "ఇప్పటికైనను భారతదేశమునందలి రాజకీయఖైదీలను విడుదలచేసి మనయందు వారికి విశ్వాసముకలుగజేయునో ఈ విషమసమయమున భారతదేశసేవకై అన్ని పార్టీలనాయకులను ఏకము చేయవీలగును- భారతదేశములో నిప్పుడేర్పడిన క్లిష్టస్థితులు పరిష్కారముచేయుటకు ఈబిల్లు అనవసరమైయుండును."అని చెప్పిరి.

### అమెరీ అంత్యోపన్యాసము

మూడవరీడింగుపై మాట్లాడుచు అమెరీగారు ఈక్రిందివిధముగా చెప్పిరి: "సాధ్యమైనంతత్వరలో బ్రిటిషు సామ్రాజ్యమునందు భారతదేశము స్వతంత్రసమానభాగస్వామ్యము పొందవలెనని ఈసభవారు ఈదేశప్రజలు హృదయపూర్వకముగా వాంఛించుచున్నారు ఈ విషయమునందు అట్లాంటికుహక్కుపత్రమునకు పూర్వమే మనము మార్గనిర్ణయులమైతిమి-అట్లాంటికు హక్కులపత్రము (చర్చిలు-రూజ్ వెల్టుప్రకటన) క్రొత్తసిద్ధాంతమును ప్రతిపాదించుటలేదు- అదిఆచరణలోవర్తింపజేయబడవలసినవిషయము కూడదు-కార్యాచరణమునందు ఆస్తికలసభ్యులం ప్రభుత్వపరము చేయు ర్పరచిన భారతీయుల లుకేసుకొని తమదేశ కొనసాగించుకొందురు కృతజ్ఞడనుగా నుండె

బిల్లుయొక్క మూ ... ను. సార్వభౌమాదు అంగీకరింపగ వబడును.

---

వెంకటే

వ్యాపారము చేసికొన నుదెబ్బతీయని దుటలమెరికె ఆమెఅమెరికా? దెబ్బతీసి కుం రూజ్వెల్టుగారు ఈవ్యా సిపాలుకేట మెరికానా గా ఒకజన్మనుజలాంతర్గా దెబ్బతీసిముంచివేసినట్లు నారు.

---

15 సెప్టంబరు 1941నుండి

## వార్ఫేజిరేట్లు అధికమగుట

సికింద్రాబాదు స్టేషనునందు

డెలివరీయిమ్పుటకు సిద్ధముగాయున్న సరుకులు వరియొయితరప్రను తెచ్చియుంచి రైల్వేఅధీనములోనికి రానివరకులపై వార్ఫేజిరేట్లు ఏడవ మణుగుకుగాని అందు భాగమునకుగాని

మణుగుకు 1౯

---

## *కటించబడని వ్రాతలు

...విషయములనుగురించి మాకు
...కాలవందుకు విచా
...డితుల నడిగి తెలిసి
...ర్చు అనవసరము.
...స్థానం మహారాణి
...జేలిముద్రల ఆధా
...కటించవలు లేదు)
...గారు (గ్రంథాలయంలో దొరకనము
(జవాబు ఏమి?)
...మహాబూబునగరం ...కృష్ణ జయంత్యుత్స
...ము (విశేషమేదియు
...నల్లగొండ హై... మహూర్తిన అ...
...ము (అన్నియు
...దీ లేదు)
...ష్టాలు [ఇది
...గురించి ఆక్షేపణ
(విశేషమేదీలేదు)
వార్త (అర్థంకాలేదు)
...ష్టయం [సమయం
...చిన మెంబ (ఈదిశే
...)
...మెంటువారు ఈదుండగ
...మాసనష్టపు దావాలకు
...పెద్దేరు గ్రంథాల
...కోయిలకొండ బస్
...చేసినవారిసంతకము, వి
సంతకం, విలా
...రణ (విశేషం
...ష్టభవనాల కా

## జిన్నా గారి అసార్థము

### అమెరీగారి సమాధానము

ఇండియాలో దేశరక్షణసంఘ సభ్యత్వానికి ఇటీవలకొందరిచ్చిన రాజీనామాలనుగురించి బ్రిటిషుపార్లమెంటుకామన్సుసభలో సెప్టెంబరు ౧౧కతేదిన ప్రశ్నించిరి– అమెరీగారు ఈక్రిందిప్రత్యుత్తరమునిచ్చిరి:–

"వైస్రాయికార్యనిర్వాహకవర్గంలో ఎవ్వరును రాజీనామాఇవ్వలేదు. రాష్ట్రాలలోను, సంస్థానములలోను వాణిజ్యపరిశ్రమ, కార్మికసంస్థలలోనుచేయుచున్న యుద్ధప్రయత్నములకు, కేంద్రప్రభుత్వములోగల సంబంధమును అభివృద్ధి చేయుటయు దేశరక్షణసంఘనిర్మాణ ముఖ్యోద్దేశ్యము– సాధారణ కాల రాజ్యాంగవిధానము అమలులోఉన్న నాలుగురాష్ట్రాల ప్రధానులకు ఈఅభిప్రాయముతోనే ఆహ్వానాలుపంపిరి–వారుకూడ దీనికిఅంగీకరించిరి. వీరి ప్రధానమంత్రిత్వమే గణింపబడినది కాని, వారిలోముగ్గురు ముస్లింలీగుసభ్యులుగా ఉన్నారను విషయముతో ప్రమేయములేదు.

ముస్లింలీగుఅధ్యక్షుడుగాఉన్న జిన్నాప్రమేయములేకుండా నియమింపబడినారుకాబట్టి దేశరక్షణసంఘమునుంచియు వైస్రాయి కార్యనిర్వాహకవర్గమునుంచియు బెంగాల్,పంజాబ్,అస్సాంరాష్ట్రప్రధానులును, యితరముస్లింలీగుసభ్యులును రాజీనామాఇవ్వవలసినదని లీగుకార్యనిర్వాహకవర్గముకోరినది. ఈముగ్గురుప్రధానులు కార్యనిర్వాహకవర్గముకోరికఅను అంగీకరించిరి, హైద్రాబాదు కార్యనిర్వాహకవర్గాధ్యక్షపదవి అంగీకరించినతర్వాత ఛతారీనవాబుగారు దేశరక్షణసంఘసభ్యత్వానికి రాజీనామాఇచ్చిరి– బేగంషానవాజుగారు సంఘసభ్యులుగానేఉన్నారు– మరెవ్వరును రాజీనామాలుఇవ్వలేదు

మిస్టర్ అమ్మన్ గారిప్రశ్న–మీరు ముస్లింలీగుప్రతినిధులని ప్రభుత్వం అజాగ్రత్తగా చెప్పినందువలన ఇది సంభవించినదా?

అమెరీ: ఇండియాలో ఏప్రజాసంస్థలోనైనా రెండుకుకాలవారికి న్యాయమైన ప్రతినిధిసంఖ్యఉండుట ఎప్పటికినిఅవసరము–ముస్లింలీగు గావించినతీర్మానమును ఆచరణకొనెంచునట్లుచేయుటకు జిన్నాగారు ఈవిషయానికి అపార్థము చేసినారు–ఎవరినైనా ముస్లింలీగు ప్రతినిధులుగా అహ్వానించుమని ప్రభుత్వము ఏప్పుడుచెప్పలేదు!

## ముస్లింలీగు కార్యవర్గాజ్ఞ

### బేగంషా నవాజ్ గారి ప్రతికూలత

లాహోరు స్పెప్టెంబరు౧౦

పదిరోజులలో దేశరక్షణసంఘ సభ్యత్వమునకు రాజీనామానివ్వవలెనని ముస్లింలీగు వర్కింగు కమిటీవారు బేగమ్షానవాజాగారిని కోరియుండిరి! కాని రాజీనామానిచ్చుటకు ఆమె నిరాకరించుచు ఈప్రకటనగావించెను:–

లీగుప్రతినిధిగా నేను దేశరక్షణ సంఘములో చేరలేదు–భారతదేశస్త్రీలపక్షమున నేన దానిలో చేరితిని, "స్త్రీలపక్షమునను, పంజాబుపక్షమునను మీరు దేశరక్షణసంఘములో సభ్యత్వమునంగీకరించుచో నాకు సంతోషముకలుగును" అని వైస్రాయిగారు నాకు తంతినిచ్చిరి,

లీగుసభ్యురాలనుగా నేను లీగపాలిసీకి వ్యతిరేకముగాచేయలేదు–దేశరక్షణసంఘములోనున్న ఒక్కస్త్రీని రాజీనామానిచ్చి రావలసినదిగా లీగుఅధ్యక్షుడు కోరుచున్నాడు–కాని మహమ్మదీయులషరియతు న్యాయశాస్త్రము ప్రకారము స్త్రీలకు హక్కులనాసంగవలెనని ఆయన మహమ్మదీయులను ప్రోత్సహింపజాలడు– భారతస్త్రీలుఒంటరిగా తమహక్కులకైపోరాడవలెనని ౨౦ సంవత్సరముల అనుభవమువలన నాకు తెలియవచ్చి

ముస్లిములకు తగినప్రతినిధిసంఖ్యను ఇచ్చారని జిన్నాగార్వారికివిజాబులో తెలియచేసినారు మొత్తంమీద ముస్లిములకు హిందువులకు సరియైనప్రాతినిధ్యం ఇచ్చారనేఅర్థంతప్ప వేరుకాదు–ప్రధానులను అహ్వానించుట. వారు అంగీకరించుటకూడా వారిప్రధానమంత్రిత్వమునుబట్టియేఉన్నదనియు, వారు ప్రధానత్వము మానివేసినపుడు వారితర్వాత వచ్చినవారే ఈస్థానాలు ఆక్రమించుకొందురనియు జిన్నాగారికి వ్రతంసముగా తెలిపినారు.

వది. తమ హక్కు లను, స్వేచ్ఛను రక్షించుకొనుటకు బ్రిటిషు ప్రభుత్వమువారొసంగు ప్రతి అవకాశమును వారువినియోగించుకొనవలెను– దేశముయొక్క సైనికవ్యవహారములలో భారతస్త్రీలహక్కులను ప్రభుత్వమువారుగమనించిరి– స్త్రీలు ఈఅవకాశమును వినియోగించుకొని తమసంపూర్ణకు ఈఉద్దేశ్యములను నెరవేర్చుకొనవలసియున్నది–ఈఉద్దేశ్యముతోనే నేనుదేశరక్షణసంఘసభ్యత్వమును అంగీకరించితిని– ఇటీవలఅంతర్జాతీయస్థితులు క్లిష్టమైనవి. ప్రపంచాభివృద్ధికిగాని, ప్రజాప్రతినిధిప్రభుత్వస్థాపనమునకుగాని భారతదేశము తనప్రయత్నములను ద్విగుణీకృతము చేయవలసియున్నది– మహమ్మదీయులు యుద్ధప్రయత్నములో తోడ్పడరాదనియుద్ధమునకుపూర్వము లీగువారుతీర్మానించిరి. కానియుద్ధము ప్రారంభముకాగానే ఈతీర్మానము మహమ్మదీయమంత్రులకు పార్లమెంటరీకార్యదర్శులకు వర్తింపజేసిరి– తర్వాతమహమ్మదీయులు యుద్ధప్రయత్నములలో పాల్గొనుటయే మంచిదనితలచి నిషేధమునుపూర్తిగాతొలగించిరి– నేనుపంజాబుప్రభుత్వములో పార్లమెంటరీసెక్రటరీని రాష్ట్రీయుద్ధసంఘములో మెడికల్ సబ్ కమిటీసభ్యురాలను ఈయుద్ధములో వివిధరకముల యుద్ధప్రయత్నములను సమన్వయముచేయుట కిదిఅవకాశమొసంగునని నేనుతలచితిని– కనుక దేశరక్షణసంఘములోనుండుటయే సరియైనమార్గమని నేనుతలచుచున్నాను–

### రజాఅలీగారు

డిసెంబరు ౧౫ వతేదిన సిలోన్ కమిషన్ పనివిషయంలో హైదరాబాదు(దక్కన్)నుండి వెడలిపోయెదరు అబాన్ ౨వతేదినవీరు ము–ఘు–వ–ప్రభువుగారితో ౧౮ గంటలసేపు సంభాషించిరి. మరల ఆబాన్ ౯ వతేదినకూడ ప్రభువుగారితోసంభాషించిరి ౬ వతారీఖున సర్కారీ అధికారులు నేకులు రజాఅలీగారితో సంభాషించిరి. రజాఅలీగారు శికింద్రాబాదు కంటోన్మెంటును దర్శించిరి– ఉస్మానియావిద్యాపీఠమును దర్శించి విద్యార్థులతో సంభాషించిరి. అతిథిభవనంలో బహదర్ యార్ జంగు గారితో చాలాసేపుమాట్లాడిరి– అబాన్ ౭వతేది ఛతారీనవాబుగారు రజాఅలీగారివద్దకుపోయి ౧గంటసేపుసంభాషించిరి. వీరికి రెసిడెన్సీలోను, ఉస్మానియా అస్పత్రిలోను, సన్మానములుజరిగినవి.

## హైదరాబాదు

### బజారు ధరలు

తేది ౯–౧౨–౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము

ధరలన్నీ హాలీకే.

| వస్తువు | పల్లా ౧కి ధర రూ | అ | పై | |
|---|---|---|---|---|
| కిచిడిసాంబర్లు | ౨౩ నుండి ౨౪౮ | | | |
| సంబర్లు | ౨౩ | ౦ | ౦ | |
| ఢిల్లీబోగాలు | ౨౨ | ౯ | ౦ | |
| రాంసాగర్లు కేళ్ళు | ౨౧ | ౯ | ౦ | |
| సానక్రాం | ౨౧ | ౮ | ౦ | కొత్తవి |
| ,, | ౨౩ | ౦ | ౦ | పాతవి |
| ఆర్కాటి | ౨౧ | ౦ | ౦ | కొతవి |
| ,, | ౨౨ | ౦ | ౦ | పాతవి |
| కోవామణి | ౨౦ నుండి ౨౧ వరకు | | | |
| బదుములు | ౧౯ | ౮ | ౦ | |
| దేశావరి | ౨౦ | ౦ | ౦ | |
| **గోధుమలు** | | | | |
| షర్బతి | ౨౨ | ౯ | ౦ | |
| బన్సి | ౨౩ | ౦ | ౦ | |
| అష్కారీ | ౨౦ | ౦ | ౦ | |
| పోటియా | ౨౦ | ౦ | ౦ | |
| ఎఱ్ఱగోధుమలు | ౧౯ | ౮ | ౦ | |
| **జొన్నలు** | | | | |
| తెల్ల జొన్నలు | ౧౨ నుండి ౧౧౮ వరకు | | | |
| పచ్చజొన్నలు | ౧౧ | ౧ | ౦ | |
| మడికట్టు జొన్నలు ౧౦౮ | ౧౧ | ౦ | ౦ | |
| సెనగలు | ౧౬౮౦ పరకేక ౧౯౦కేక | | | |
| కందులు తెల్లవి | ౧౦ | ౮ | ౦ | |
| మినుములు | ౧౩ | ౧ | ౦ | |
| అంకలు | ౧౪ | ౯ | ౦ | |
| పజ్జలు | ౧౧ | ౪ | ౧ | |
| **పప్పులు** | | | | |
| సెనగ పప్పు | ౨౩ | ౦ | ౦ | |
| కంది ,, | ౧౬ | ౯ | ౦ | |
| పెసరసెనగ,, | ౨౧ ౨౨ | ౯ | ౦ | |
| లంక ,, | ౧౯ | ౧ | ౦ | |
| మినప ,, | ౨౧ | ౦ | ౦ | |
| పెసర ,, | ౨౦ | ౦ | ౦ | |
| బెల్లము | ౧౬ నుండి ౧౪ వరకు | | | |
| ఉప్పు | ౧౨, ౧౧ | ౯ | ౦ | |
| పుల్లిగడ్డ | ౧౬ నుండి ౧౨ వరకు | | | |
| వరుగు మంచిది | ౩౦ నుండి ౨౦ వరకు | | | |
| చక్కెర మణుగు [౪౦ సేర్లు] | | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ | |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ | |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజామాబాదు ,, ,, | ౧౩ | ౧౨ | ౦ | |
| ఎఱ్ఱచక్కెర ,, పల్ల | ౧౩, నుండి ౧౫ వరకు | | | |
| దర్గచక్కెర ,, ౪౦ సే. | ౧౬ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ మణుగు ౧౨ సే. | ౪ | ౧౨ | ౦ | |
| అల్లం ,, ,, | ౪ | ౧౨ | ౦ | |
| మణుగు ౧౨ సే | | | | |
| కొబ్బెరనూనె ,, | ౪ | ౯ | ౦ | |
| కుసుమనూనె ,, | ౫ | ౦ | ౦ | |
| నువ్వులనూనె ,, | ౪ | ౯ | ౦ | |
| వేరుసెనగనూనె ,, | ౪ | ౦ | ౦ | |
| కిరోసిన్ (గ్యాస్) ,,డబ్బా ౧కి | ౪–౧౨–౦ | | | |
| నెయ్యి మణుగు ౪౦ సేర్లు | | | | |
| విదర నెయ్యి ,, | ౭౦ | ౦ | ౦ | |
| తెలంగాణా ,, | ౪౫ | ౦ | ౦ | |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ | ౨ | ౦ | |
| బంగారు తులా ౧కి | ౫౦ | ౯ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౭౧ | ౮ | ౦ | |
| ,, తు ౧కి | ౦ | ౧౧ | ౬ | |
| సవరన్ ౧కి హాలి రూ– | ౩౩ | ౯ | ౦ | |
| **మారకం** | | | | |
| హాలీకి కల్దార్లు | ౧౬ | ౫ | ౬ | |
| కల్దారుకు హాలీలు | ౧౬ | ౩ | ౬ | |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ | |
| వేరుసెనగ ,, | ౯ | ౪ | ౦ | |
| బుడ్డలు పల్లా ౧కి | ౯ | ౪ | ౦ | |
| పప్పు ,, | ౧౨ | ౦ | ౦ | |

గమనిక:–

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము– అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు,